# సమాధానవేదిక



నిర్వాహకుఁడు:

ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య, M. A.,

తెలుగు విద్యార్థి ప్రచురణలు

మచిలీపట్నం

# మనవి

విద్యార్థులలో తరగతి, వయస్సుతోపాటు లోకజ్ఞానం పెరగడం లేదు. లోకజ్ఞానపు బోధ విద్యా ప్రణాళికలలో సముచిత స్థానం పొందడంలేదు. సతతమూ తరగతి పుస్తకాలతో సతమతమయ్యే విద్యార్థికి ప్రపంచజ్ఞానాన్ని సమకూర్చే గ్రంథ పఠనం కష్టమవుతోంది. పాఠ్యాంశాలుగా నిర్ణయించబడిన వీటినుండి నేర్చుకొనేది బహుపరిమితంగా వుంటోంది. ఈ స్థితిలో ఎవరిజ్ఞానతృష్ణ ననుసరించి వారు పాఠ్యాంశాలకుతోడు అధిక అదనపుకృషి సల్పినగాని వయస్సుకు వలసినంత లోకజ్ఞానం పొందలేక పోతున్నారు.

ఈ పరిస్థితి గమనించి విద్యార్థులకు సుబోధక మయ్యేటట్లు వివిధాంశాలపై ప్రముఖుల రచనలు ప్రచురించ సంకల్పించాం. ప్రప్రథమంగా పూజ్యులు ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్యగారు 'తెలుగు విద్యార్థి' పత్రికలో నెలనెలా నిర్వహించిన ప్రశ్నలు - సమాధానాలు శీర్షిక సమాధాన వేదికగా ప్రచురిస్తున్నాం. మతము, సంస్కృతి, సాహిత్యము, కళలు, రాజకీయాలు, విద్య మొదలుగాగల అంశాలపై పాఠకుల సందేహాల నివృత్తిచేసిన యీ (సమాధానవేదిక) ప్రచురణ మా సంకల్పానికి సార్థకతనిచ్చేదిగా భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రయోజనం గుర్తించిన పలువురు పెద్దలు దీనిని పుస్తక రూపంలో ప్రచురించేందుకు పదేపదే ప్రోత్సహించి మా సంకల్పానికి

అమితబలం చేకూర్చారు. అందుకు తగినట్లుగా పూజ్యులు ఆచార్యజీ దయతో ప్రచురణకు అంగీకరించినందులకు ఆంధ్ర విద్యార్థుల తరఫున వారికి ఎంతేని ఋణపడివున్నాం.

ప్రథమ ప్రయత్నంమూలాన అనుకొన్నంత ఆకర్షవంతం గాను, తొందరగాను వెలువరించలేకపోయినందులకు మన్నించ కోరుతున్నాం. మలిముద్రణలో తమ తమ సలహాల ననుసరించి మరింత ఆకర్షవంతంగా మీ ముందుంచగలమని మనవి చేసుకుంటున్నాం. తెలుగు విద్యార్థిని తమ బిడ్డలా ఆదరిస్తున్న తాము తెలుగు విద్యార్థి ప్రచురణలను కూడ అదే మాదిరి సాదరంతో చూడగలరని విశ్వసిస్తున్నాం.

మా సంకల్ప సిద్ధికి మమ్ము దీవింప అంజలి ఘటిస్తున్నాం.

ఇట్లు

ప్రచురణ శాఖాధిపతి

తెలుగు విద్యార్థి ప్రచురణలు

మచిలీపట్నం

# మతము : సంస్కృతి

1. మన ప్రాచీన ఆర్య విజ్ఞానంకన్నా ఆధునిక శాస్త్రవిజ్ఞానం భిన్న మయినదా?

విజ్ఞానంలో అనేక భాగాలున్నాయి; (ఎ) ప్రత్యక్ష అనుభవంద్వారాను ప్రయోగాలద్వారాను పదార్థాలను గురించి మనం సంపాదించే విజ్ఞానం ఒక భాగం. దీనికే (Science) అని పేరు. (బి) మంచి, చెడ్డ, న్యాయం, అన్యాయం, నీతి అవినీతి—వీటి అర్థాన్ని తెలియజేసే విజ్ఞానం రెండవభాగం. మనుష్యులు ఏకాకులుగాక పదిమందితో కూడిన సంఘంలో నివసిస్తూవున్నారు. ఒకరి విషయంలో ఇంకొకరు ఎలాగు ప్రవర్తించవలెనో తెలియడం అవసరం. సాంఘిక శాస్త్రాలు ఈవిజ్ఞానాన్ని సమకూరుస్తవి. (సి) ఆత్మజ్ఞానం మరొక భాగం. మానవజీవితం ఏలాటిది? మానవుడు సాధించతగ్గ పరమార్థం ఏది? అన్న విషయాల గురించిన జ్ఞానంకూడా అవసరం. ఈ మూడింటిలో సైన్సు, విజ్ఞానం విషయంలో ప్రాచీనార్యులకంటే ఇప్పటివారు భిన్నలు; రెండవరకపు విజ్ఞానంలో కొన్నిపట్ల భిన్నులని కొన్నిపట్ల కాదని చెప్పవలసియున్నది. మూడవరకపు విజ్ఞానంలో ఇప్పటివారు భిన్నలుకారు. పరమార్థాన్నిగురించి ఆర్యులుచేసిన సిద్ధాంతాలు యిప్పటికికూడా అనుసరణీయములే.

2. అసంఖ్యాకంగా స్త్రీలు బౌద్ధమతావలంబికులై సన్యాసినులుగా మారిపోవడం తోపాటు వ్యభిచారం కూడా బౌద్ధా రామాల్లో వృద్ధిపొందిన దనే ప్రవాద వాస్తవమేనా ? ఈ విషయం వివరించ గోర్తాను.

అసంఖ్యాకంగా స్త్రీలు సన్యాసినులుగా మారిపోవడం జరుగలేదు. స్త్రీలను భిక్షునిలుగ సంఘంలో చేర్చుకొను విషయాన బుద్ధభగవానుడు ఎక్కువ ఉత్సాహమును చూపలేదు. అందుచేత వారు పరిమితంగానే చేరుతూ వచ్చారు. సన్యాసులలో కొందరు కపటిసన్యాసులుగ నుండునట్లు భిక్షుణిలులో కొందరు శీలరహితులై ఉండినమాట వాస్తవమే. కాని అట్టి వారి సంఖ్య చాల తక్కువ. బౌద్ధరామముల గురించి వివరించిన చైనా యాత్రికులు ఆ రామములో ఇతర దురభ్యాసము లున్నట్లు వర్ణించినంత ఎక్కువగ వ్యభిచారమును గురించి చెప్పి యుండలేదు. ఆరవ శతాబ్ది తర్వాత నాటకాది సంస్కృత గ్రంథములు కొన్నిటియందు భిక్షుణీలుగూడ చారులుగాను, తార్పువారుగాను, కులస్త్రీల శీలమును చెరపువారుగను చిత్రింపబడి యుండుట వాస్తవమే. కాని ఈ అపనిందలకు బౌద్ధసన్యాసినులేగాక, జైన్ సన్యాసినులు, కాపాలికులు, మొదలైనవారు పాత్రులు. గనుక ప్రత్యేకముగ బౌద్ధారామములలో వ్యభిచారము వృద్ధిగాంచె ననుటకు ఆధారములులేవు. మనదేశములో బౌద్ధమతము క్షీణించుటకు కారణములను

పేర్కొన్న ప్రామాణిక పరిశోధకు లెవ్వరు దీనిని గురించి ఎక్కువగ ప్రస్తావించి యుండలేదు.

3. ఆంగ్లేయులవలెనే మహమ్మదీయులుగూడ విదేశీయులుగా కొందరిచే చిత్రింపబడుచున్నప్పుడు ద్రావిడులకు చెందిన ఈ దేశము లో ఆర్యులు గూడ విదేశీయులు గా పరిగణింపబడుట తప్పు కాగలదంటారా ?

తప్పే. మహామ్మదీయులు విదేశీయులు కానేకారు. వందలకొద్ది వేలకొద్ది సంవత్సరాలుగా స్థిరనివాసము లేర్పరచుకొన్నవా రందరికీ ఇది స్వదేశమే.

4. ద్రావిడులైన, తెలుగువారు గూడ తమలో తాము "ఆర్యా" అని సంబోధించుకొనుటకు కారణమేమి ? "ద్రావిడా" అని ఉపయోగిస్తే వచ్చే నష్టమేమిటి ?

ప్రస్తుతం మనం మాట్లాడే తెలుగుభాష శుద్ధద్రావిడం కాదు. శుద్ధ ద్రావిడం ఏనాడో అదృశ్యం అయింది. మన భాషలో తత్సమాలు తద్భవాలు దేశీపదాలు అన్నీ మిశ్రితమై పోయినవి, ఆ కారణంచేత "ఆర్యా" అన్నమాట పరాయి భాషలోని మాట కాదు. తెనుగుభాషలోని మాటే. దానిని మార్చుకొనవలసిన అవసరం ఏమీ లేదు.

5. దేవునికి పూజలు చేయుటవలన ప్రయోజనం ఉంది అంటారా ? దేవునిగూర్చి మీ అభిప్రాయం ఏమిటి ?

మానవమాత్రులను వీరులని శూరులని కవులని గాయకులని తత్వవేత్తలని—వారిలో ఎన్నిలోపాలున్నా వారి శిలా

విగ్రహాలను ప్రతిష్ఠించి వాటికి పూలహారాలు వేసి, వాటిని సందర్శించడం, ఎంతో ఉత్తేజకరమని భావిస్తున్నాముగదా ? అలాంటప్పుడు ఏలాటి లోపములులేని పరమపురుషుడు, సమస్త సత్యములను తెలిసినవాడు, సర్వాంగసుందరుడు, అందరికీ మంచిచేయువాడు అయిన భగవంతుని — ఆదర్శపురుషుని — పూజించడం ఎంత ప్రయోజనం కలదీ ప్రత్యేకంగా చెప్పవలసినది లేదు. దేనిని మనం ఉత్తమాదర్శమని భావిస్తామో దాని స్వరూపమే భగవంతుడు. ఉత్తమ ఆదర్శాన్ని లక్ష్యంగా పెట్టుకొని, దానిని సాధించడానికి ప్రయత్నించడమే భగవత్పూజ.

6 నాగార్జునాచార్యుని కాలంనాటి విద్యాబోధనా పద్ధతులేలా ఉండేవి ?

గురువువద్ద శిష్యుడు కూర్చుండి, గురువుచెప్పిన దాని నంతను వల్లెవేసి, జ్ఞాపక ముంచుకొనడము; తర్వాత బోధించిన విషయములను మననచేసి, సహాధ్యాయులతోటి వాదోపవాదములను గురువుల సమక్షమున గావించి, విషయములలోని లోతుపాతులను గ్రహించడం. గురుముఖము తప్ప, విద్యను నేర్చుకొనుటకు పుస్తకములు మొదలైన సాధనములా కాలమున లేవు. ఒక్కొక్క గురువువద్ద కొద్దిమంది శిష్యులు మాత్రమే ఉండువారు. విద్యాబోధ అంతయు గురుకుల వాసపద్ధతిని జరుగుచుండెడిది. బౌద్ధులుకూడ ఈ పద్ధతినే అనుసరించు చుండిరి.

7. జన్మస్థానమైన మన దేశంలో బౌద్ధమతం క్షీణించడానికి కారణమేమి ?

అది క్షీణించలేదు అది హిందూమతంలో లీనమైపోయింది.

8. మానవుని మనుగడలో "మత నమ్మిక" ఎటువంటి పాత్ర నిర్వహిస్తోందంటారు ?

ప్రధాన పాత్రను నిర్వహిస్తున్నది. మానవులందరూ కూడా ఏదో ఒక మతాన్ని అనుసరిస్తూనే ఉన్నారు. ఒక మతంపోతే, దాని స్థానే ఇంకొకమతం వస్తూనేవుంది. మత శూన్యం ఎక్కడా కనుపించదు. మానవ జీవితంలో దుఃఖం అనేది తప్పదు. దుఃఖం వున్నంతవరకు దానిని నివారించుకోనడానికి ఉపాయం కనిపెట్టూ ఉండడం అతనికి సహజం. శాశ్వత సుఖాన్ని ఇచ్చే పరమార్థం ఒకటి వున్నదన్న నమ్మకమే మతం. ఆ నమ్మకం సైంటిష్టులకు, కమ్యూనిస్టులకు అందరికీ ఉంది.

9. వ్యక్తిత్వమనగా నేమి ?

మనిషికీ మనిషికీ ఎన్నో పోలికలున్నా ప్రతిమనిషిలో ఒక విశిష్టతకూడా ఉంది అలాటి విశిష్టత– ప్రత్యేకశక్తికి వ్యక్తిత్వం అనిపేరు. కొందరిలో అది కవిత్వంచెప్పే శక్తిగాను, కొందరిలో సంగీతంపాడే శక్తిగాను, మరి కొందరిలో మరొక శక్తిగాను ఉంటుంది. ఎవరిలో ఏశక్తి లీనమైవుందో తెలుసుకోనడమే వ్యక్తిత్వాన్ని తెలుసుకోనడం.

10. దైవశక్తిలో తన జీవితంలో పుత్పన్నమయ్యే సమస్యల పరిష్కారానికి దైవంమీద భారంవేసి కళ్ళు మూసుకొనే పద్ధతివల్ల మానవుని ప్రయత్నం కుంటుపడుతుందని, అలా వాస్తవం నుంచి పలాయనంజెంది, వున్నచోటనే ఉండి, మానసిక తర్కవితర్కానికి చోటీయక తనశక్తి తాను వికసించనీయడంలేదనీ, తద్వారా సామూహిక మానవశక్తి ప్రగతిగనదనే అభిప్రాయ పడ్తున్నాను. దాని విషయంలో మీ అభిప్రాయం తెలియపరచ కోరుతాను.

మీాపె సరియైన అభిప్రాయం కాదు. ఏదో ఒక ఫలితం కోరి మనం దానిని సాధించడానికి ప్రయత్నం చేస్తాం. కాని ఫలితం లభించకపోవచ్చు. దైవంమీాద భారంవేయడం అంటే— ఫలితం లభించినా లభించకపోయినా ఉత్సాహంతోను పట్టుదలతోను మన ప్రయత్నం మనం చేయడం అన్నమాట. సైంటిస్టు ఏం చేస్తున్నాడు ? సత్యాన్వేషణంలో ఎన్నో ప్రయోగాలు (Experiments) చేస్తూ ఉంటాడు. అనేక ప్రయోగాలు విఫలం అవుతూ ఉంటవి. కాని ప్రయత్నం మానుకొనడు. అలాగే దైవంమీాద భారంవేయడం అనేది.

11. అవతారమనగా నేమి ?

ప్రపంచంయొక్క సృష్టి స్థితిలయములకు భగవంతుడు కర్త. ప్రపంచంలోని ప్రాణికోటియొక్క జీవితం ఒకేవిధంగా ఉండదు. సుఖంతో దుఃఖంతో కూడుకొని ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అధర్మం విపరీతంగా పెరగడంచేతను, ధర్మం లోపించడం

చేతను, దుఃఖం భరింపరానిది అవుతుంది. అట్టి సమయాలలో ధర్మాన్ని పునఃప్రతిష్ట చేయడానికి ఏదో ఒక రూపంలో భగవంతుడు జన్మ ఎత్తి దుష్టశిక్షణాన్ని శిష్టరక్షణాన్ని గావిస్తాడు. ఆ విధంగా భగవంతుడు ఎత్తే జన్మకు అవతారం అనిపేరు. భగవంతుడొక్కడున్నాడనే విశ్వాసం కలవారికి ఈ జవాబు. అట్టి నమ్మకం లేనివారికి ఈ ప్రశ్నతోగాని జవాబుతోగాని ప్రసక్తి లేదు.

12. బౌద్ధుల కాలమందలి ఆర్థిక వ్యవస్థయొక్క రూపమేది ?

ఈ ప్రశ్నకు సంక్షిప్తంగా సమాధానం చెప్పడానికి సాధ్యంకాదు. బౌద్ధులకాలం అనేది క్రీ. పూ 400 మొదలు క్రీ. వె 400 వరకు — సుమారు 800 సంవత్సరాల కాలం. అంతటి దీర్ఘకాలంలో ఆర్థిక వ్యవస్థ రూపం ఇదమిద్ధమని రెండు మూడు వాక్యాలలో చెప్పడం ఎలాగు ? మొత్తంపైన దేశం యొక్క ఆర్థికవ్యవస్థ ప్రశంసనీయంగా వున్నట్లు కనిపిస్తుంది. వ్యవసాయం, నేత — నూది, పట్టు, ఉన్ని, నారలు — సుగంధ ద్రవ్యాలను తయారుచేయడం, నౌకానిర్మాణం, దంతపుపని, లోహపరిశ్రమలు, నగిషీపని, వర్తక వ్యాపారాలు — ఇవన్నీ ఉచ్చస్థితిలో ఉన్నట్లు చెప్పవచ్చు. శిల్పులు వారివారి విద్యలందు నిపుణులు. ఆయాపనులు చేసేవారు శ్రేణులను పేరుతో సంఘాలుగ ఏర్పడి వారి వారి పనులను బాధ్యతతో చేస్తూఉండేవారు. ఇంకా చెప్పవలసిన గాథ ఎంతో ఉంది.

13. పూర్వయుగమందు ప్రజాతంత్ర రాజ్యములు నశించుట ఎందుచేత ?

కారణాలు రెండు: (1) అంతఃకలహాలు; (2) మౌర్య సామ్రాజ్యంయొక్క బలాధిక్యత.

14. రామాయణంకన్న మహాభారతం ఎక్కువ ప్రచారంలో వుంటుటకు, ఆదరించబడుటకు కారణ మేమంటారు.

మహాభారతం వేదంతో సమానం అయింది. అది పంచమవేదంకదా ? అందులో కథాబాహుళ్యం ఎక్కువ.

15. నాస్తికత్వం అంటే ఏమిటి ? ఏ పరిస్థితులలో మానవులు నాస్తికులుగా మారుతారు ?

భగవంతుడు లేడని చెప్పడమే నాస్తికత్వం. మనుష్యునికి అతీతమైన శక్తులు లేవనే భావమే దీనికి ఆధారం- అన్ని కాలాలలో కొందరు నాస్తికులు వుంటున్నారు. కాని ప్రస్తుతంలో వారి సంఖ్య పెరిగింది. సైన్సు వృద్ధికావడం, దాని ఫలితంగా ప్రకృతి శక్తులనేకాలు — విద్యుచ్ఛక్తి, అణుశక్తి మొదలైనవి— మనుష్యునికి వశంకావడం, ఆ కారణంచేత మనుష్యునికి సాధ్యం కానిది ఏదీ లేదనే నమ్మకం వ్యాపించడం ఈ పెరుగుదలకు కొంతకారణం.

16. అశోకుడు బౌద్ధమతావలంబకుడు కాడని, తన్మత వినాశనమునకే కొంతవరకు పాటుపడినడనే వాదనకు ఆధారమేమి ? అది వాస్తవమా ?

ఆ వాదన నిరాధారమైనది. అది కువాదము. అతని శాసనములలో తాను బౌద్ధుడని చెప్పుకొన్నాడు. ఏలాగు

బౌద్ధమతస్థుడైనది స్పష్టంచేశాడు. బౌద్ధసంఘంపైన అతడొక విధమైన యాజమాన్యం వహించడం, బౌద్ధమతోద్ధరణమున కొక మహాసభను నమావేశపరచడం, బౌద్ధక్షేత్రములకు యాత్రలు చేయడం, బౌద్ధ పర్వదినములను పాటించడం, బౌద్ధ చిహ్నమైన శ్వేతగజలాంఛనమును గౌరవించడం — ఈలాంటి వన్నియు అశోకుడు బౌద్ధుడని ఋజువుచేయుచున్నవి. కాని అతడు బోధించినమతము సర్వమతసారము.

**17.** వేదములు, ధర్మసూత్రముల, అర్థశాస్త్రముల, పురాణముల, కావ్యనాటకాదుల, శిలాతామ్ర శాసనములలోని ప్రాచీనచరిత్రాంశాల నాధారంగా సమగ్రభారతదేశముయొక్క ప్రాచీన ఇతిహాసమేకాకృతిగా రచించుట సాధ్యంకాదనెదరా ? అటులు అందు కెటువంటి ప్రయత్నమైనా జరిగిందా ? వివరించగోర్తాను.

మీారు సూచించిన రచన సుసాధ్యమే. ఆప్రయత్నానికే, కె. యం. మునిషీగారి అధ్వర్యాన బొంబాయిలో 'భారత భవన్' విద్యాపీఠంవారు కొన్ని సంవత్సరాలక్రిందట ప్రారంభించి ఇప్పటికే నాలుగు గొప్ప సంపుటములను ప్రచురించారు. అది సమగ్రమై, వేదకాలమునుండి మహమ్మదీయశకము ప్రారంభమగువరకు జరిగిన చరిత్రను వివరించుచున్నది.

**18** బౌద్ధమతం విదేశాలలో వృద్ధిచెందడానికి, మనదేశంలో క్షీణించడానికి కారణమేమంటారు ?

(ఎ) దీనికి ప్రధాన కారణం హిందూమతంయొక్క ఉత్కృష్టత. అన్నిమతాలలోని సారం అందులో ప్రవేశించి ఉంది. ఏ కాలంలో కూడా భరత ఖండంలోని వారుహిందూ మతాన్ని వదలి బౌద్ధాన్ని స్వీకరించిన వారుకారుజ్ఞానులందరి యెడల, సర్వసంఘ పరిత్యాగంచేసిన వారందరియెడల, వారికి గౌరముండిన కారణాన బుద్ధభగవానుని, బౌద్ధ సన్యాసులను వారు గౌరవించారు, (బి) బౌద్ధమతం మన దేశంలో క్షీణించలేదు, అది హిందూమతంలో కలసిపోయింది. (సి) సింహళము, బర్మా, సయాం, ఇండో చైనా మొదలైన దేశాలలో అది స్థిరంగా నిలచిపోవుటకు కారణం ఆ దేశాలలో దానితో తులతూగగల హిందూమతము వంటిమతం లేకపోవ డమే కారణం. (డి)చైనా, జపాన్‌లలో ఇప్పటికి కూడ బౌద్ధమతం సజీవనంగా ఉన్నమాట నిజమే. కాని, ఆ దేశాలలో జాతీయ మతాలు అని చెప్పుకోతగ్గ కన్‌ఫ్యూసియానిజం. టావోయిజం, షింటోయిజం మొదలైన మతాలతో సహజీవనం కలదిగా ఉన్నదే కాని, ప్రజలందరు అనుసరించే ఏకైకమతంగా నిలబడ్డది కాదు. (ఇ) ఒకప్పుడు ఇది మధ్య ఏషియాలో ఉచ్ఛస్థితియం దుండేనది. కాని అక్కడగూడా క్షీణించింది. క్షీణించడమనేది మనదేశంలో మాత్రమే జరిగిందికాదు.

19. బుద్ధుని కాలంలోనే బౌద్ధమతం విదేశాలకు వ్యాపించడం మొదలిడిందా ? లేక బుద్ధుని నిర్వాణానంతరమా ? ఎవరికాలంలోను ? అందుకు గణనీయమైన కృషి చేసిందెవరు ? ఏ విధంగా ?

బుద్ధుని కాలంలో ఈ వ్యాప్తి ప్రారంభం కాలేదు. అశోక చక్రవర్తి కాలంలో ఇది ప్రారంభం. పశ్చిమ ఏషియా ఆగ్నేయయూరపులలోని దేశాలకు. సింహళం, బర్మాలకు, హిమాలయమున కావలనుండు కోటాన్ వంటి కొన్ని ప్రాంతాలకు అతడు ప్రచారకులను పంపెను. కనిష్కుని కాలంలో మధ్యఏషియా ప్రాంతాలలో ఎక్కువగా ప్రచారం జరిగింది. అంతకు పూర్వమే కోటాన్ మొదలైన ప్రాంతాలనుండి చైనాకు ప్రచారకులు వెళ్ళారు. క్రీ. శ. మొదటి శతాబ్దంలో చైనా అంతటా బౌద్ధం వ్యాపించింది. అచటినుండి కొరియాకు, కొరియానుండి జపాన్‌కు ప్రవేశం సంపాదించింది. ఈ మధ్య కాలంలో దక్షిణ భారతపు తూర్పుతీరములందుండి వెళ్ళిన ప్రచారకులు, సింహళమునుండి వెళ్ళినవారు మలయా సయాం ఇండో చైనా ప్రాంతాలలో దీనికి ప్రవేశంకల్పించారు. కొందరు ప్రచారకులు బంగాళమునుండి కూడా వెళ్ళిరి.

ఇంతటి గొప్ప కృషి జరుగుటకు ప్రధానకారణం గౌతమ బుద్ధుడు స్థాపించిన బౌద్ధసంఘం. ఈ సంఘంలో సర్వసంగ పరిత్యాగంచేసిన సన్యాసులు చేరడం, ధర్మవ్యాసంగంలోను, ప్రచా

రంలోను వారు యూనజీవం గడపడం– ఇదిగణుతింప తగ్గ గొప్ప విశేషం. దేశదేశాలలో బౌద్ధమతంవ్యాపించడానికి వారికృషియే ప్రధానకారణం.

**20.** బౌద్ధమత బోధనకు వారనుసరించిన పద్ధతులేమిటి ?

అవి రెండే పద్ధతులు. 1) ప్రసంగాలు, ఉపన్యాసాలు మొదటిది. (2) బుద్ధుని ఉపదేశాను సారం తాము జీవితాన్ని గడిపి ప్రజాసామాన్యానికి మార్గదర్శులు కావడం రెండవది. చెప్పడం ఒకటి చేయడం ఇంకొకటి అనే విపరీతం వారిలో కని పించేది కాదు.

**21.** ఇక్ష్వాకుల కాలంనాడు ఆంధ్రులంత గాఢంగా బౌద్ధ మతాభి మానులై ఉండుటకు కారణం మేమంటారు ?

ఉత్తర ఇండియాలో మౌర్యసామ్రాజ్య విచ్ఛిన్నానంత రం బౌద్ధులకు రాజాదరణం తగ్గడం కారణంగా, విజ్ఞానవేత్తలగు బౌద్ధసన్యాసులనేకులు దక్షిణాపథమునకు రావడం, ఆరామాలు నిర్మాణం చేసుకొనడం జరిగింది. వారి ఉపదేశ ప్రభావమే ఈ గాఢాభిమానం.

**22.** హిందూధర్మము—దాని మూలతత్వము మత సాంఘిక సమస్యల నది పరిష్కరించు విధానము తెలియ జేయగోరెదను.

(ఎ) మానవపురుషున్నవాడు ధర్మ, అర్థ, కామ, మోక్షా లనే నాలుగు ప్రయోజనాలను పరస్పర విరుద్ధం లేకుండా

సాధించవలెను. ఇది జన్మసాఫల్యం. ఇది హిందూధర్మంయొక్క మూలతత్వం. (బి) సంఘంలో ప్రతివ్యక్తి సంస్కార ఫలితంగా ఏపదవిలో ఉంటూఉన్నాడో (అదిగొప్ప పదవికావచ్చు, తక్కువ పదవికావచ్చు) ఆ పదవిలో తాను ఎలాగు ప్రవర్తించవలెనో ఆలాగు ప్రవర్తించడం వాంఛనీయం. దీనికే స్వధర్మానుసరణ, పరధర్మ విసర్జన అనిపేరు. సాంఘిక సమస్యల పరిష్కారానికి ఇదే ఉత్తమమార్గం. వర్ణాశ్రమ ధర్మాలకు ఇదే ఆధారం.

**23.** మన హిందువుల ఇంటిపేర్లు ఏవిధంగా ఏర్పడింది తెలియ పరుస్తారా ?

చాలా పేర్లు వారు నివసించిన గ్రామాలమూలంగా వచ్చాయి. కొన్ని వారి పూర్వులుచేసిన ఘనకార్యాలను సూచించేవి; కొన్ని వృత్తినిబట్టి వచ్చినవి. మీ గ్రామంలో ఉండే హిందువుల ఇంటిపేర్ల జాబితాను తయారుచేస్తే ఈ విషయం మీకే స్పష్టం అవుతుంది.

**24.** తత్వానికీ మానవజీవితానికీ గల సంబంధమేమిటో తెలియ పరుస్తారా ?

మానవుడు సాధించవలసిన పరమార్థ స్వరూపాన్ని దానిని సాధించడంలో అతడు అనుసరించవలసిన మార్గాన్ని తెలియజేయడమే తత్వంయొక్క ప్రయోజనం. ఉన్నస్థితికంటె

ఉత్కృష్టమైనస్థితి ఇంకొకటి కలదనిన్నీ, దానిని పొందుటయే తన కర్తవ్యమని తత్వంబోధిస్తోంది. కష్టం, దుఃఖం అనేవి లేకుండా ఏమానవుడు జీవితం గడపలేడు. అవి సంభవించి నీవు వాటిని ఎలాగు ఎదుర్కోనడమో తత్వం తెలియజేస్తుంది. తక్కిన జంతువుల జీవితానికి మానవజీవితానికి ఇందులోనే భేదం.

**25.** బౌద్ధమతం ప్రపంచానికి చేకూర్చిన ప్రయోజనం సుబోధకరంగా వివరించగోర్తాను.

(ఎ) జీవితంలో మనం అనుభవించే దుఃఖాల నివారణకు, శాశ్వత సుఖ సంపాదనకు ప్రేమ, విజ్ఞానం— ఈ రెండింటితో కూడిన ప్రవర్తనయే ఉత్కృష్ట మార్గమని ప్రబోధం చేయడం. భగవంతునిగురించి, ఆత్మను గురించి, పరలోకాన్నిగురించి దీర్ఘములైన వాదోపవాదాలు గావించి జ్ఞానం సంపాదించుటకంటే ఈ ప్రవర్తనమే ఉత్తమమార్గం. బౌద్ధమతం చేకూర్చిన ప్రయోజనాలన్నిటిలో ఇదే అగ్రగణ్యమైంది.

(బి) వర్ణవిభేదం ఉండరాదని, స్త్రీలకుకూడ స్వేచ్ఛఉండవలెననీ, ప్రాణహింసచేయరాదనీ, ధనధాన్యాలకన్న శీలమే సంపాదయోగ్యమని బౌద్ధమతం ప్రబోధంచేసింది.

(సి) బౌద్ధమతం వ్యాపించిన దేశాలన్నిటిలో— ఇండియా, చైనా, జపాన్, సింహళము, బర్మా మొదలైనవి—

దానిమూలంగా కళలన్ని ఒక విశిష్టతను సంపాదించి, సర్వతో ముఖంగా అభివృద్ధిగాంచాయి. స్థూపాలు, విహారాలు, దేవాలయాలు, విగ్రహాలు, చిత్రలేఖనం—వీటి అభివృద్ధికై పై దేశాలన్నిటిలో బౌద్ధమతం ప్రధాన కారణం అయింది,

26. బుద్ధుడు అధునాతన హిందూమతోపదేష్ట అనే డాక్టరు రాధాకృష్ణన్ గారి అభిప్రాయంతో మీరెంతవరకు ఏకీభవించగలరు ?

కొంతవరకు మాత్రమే నేను ఏకీభవిస్తున్నాను. అహింస, నైతిక ప్రవర్తనకుగల ప్రాధాన్యము బుద్ధుని ఉపదేశముల మూలమున మన తత్త్వములోనికి ప్రవేశించెను. కాని అందులోని మూలసిద్ధాంతముల నిర్వచించినవారు శంకరుడు, రామానుజుడు, మాధ్వుడు, భక్తిప్రాధాన్యమును బోధించిన చైతన్యాదులు. బుద్ధజయింతిని జరిపిన సమావేశములలో ఉపన్యాసకులనేకులు ఈమధ్యన డాక్టరు రాధాకృష్ణన్ గారి ధోరణిలోనే మాట్లాడిరి. కాని వారి మాటలలో అతిశయోక్తి ఎంతో ఉన్నది.

27. వర్ణాశ్రమ ధర్మాలు ఎప్పుడు ఎవరు ఏర్పరచారు ? వీని విశిష్టత ఏమిటి ? బుద్ధునికాలంలో యివి సడలించిబడినమాట వాస్తవమా ?

వీటిని ఒకప్పుడు ఎవరో ఏర్పరచినట్లు చెప్పడానికి వీలు లేదు. యివి క్రమక్రమంగా పుట్టి పెరిగినవి. వర్ణ ధర్మంలోని

విశిష్టత ఏమిటంటే ఎవరు ఏపని చేయడానికి స్వభావంచేతను శిక్షణచేతనూ అర్హుడో అట్టిపనినే అతడు చేయడం మంచిదన డం. అర్హతవున్నా లేకపోయినా ఏపని అంటే ఆ పనిని చేయడానికి ప్రయత్నించడం వర్ణధర్మానికి విరుద్ధం. ఆశ్రమ ధర్మం అంటే మానవజీవితంలో ఏ యే వయస్సునందు ఏ యే దశ యందు ఎట్టి పనులను చేయవలెనో వాటిని చేయడం. బాల్యంలో విద్యాభ్యాసం; వయస్సు వచ్చినతర్వాత వివాహం ఆడి కుటుంబాన్ని పోషించడం మొదలయినవి. ఇదే అను సర ణీయమైన పద్ధతి. బుద్ధుని కాలంలో యివి సడలించబడినవి అనడం పొరపాటు. అతడు కూడా వర్ణాశ్రమ ధర్మాలను అంగీ కరించినవాడే.

28. భారతీయ తత్వశాస్త్రములో బుద్ధుని తత్వవివేచన ఎంతవరకు ఇమిడిఉందంటారు ? మన దేశములో తిరిగి బౌద్ధమతముపట్ల ఎక్కువ ఆద రము కలుగుటకు కారణమేమై వుంటుంది ?

(1) ప్రపంచంలో ఏదీకూడా స్థిరంగా ఉండదు; ప్రతిదీ ప్రతినిమిషమూ మారుతూనే ఉంటుంది అనేసిద్ధాంతము: (2) కార్యకారణ సంబంధాధారమైన సిద్ధాంతము.— ఈరెండూ భారతీయ తత్వశాస్త్రంలోను బౌద్ధంలోను ఇమిడిఉన్నాయి.

కాని బుద్ధుడు ఆత్మ ఒకటి ఉన్నదనిగాని, పరబ్రహ్మం ఒకటి ఉన్నదనిగాని అంగీకరించడు. మోక్షమార్గాలలో కర్మ—సత్ప్రవర్తన—ఒకటి అని భారతీయతత్త్వం అంగీకరిస్తుంది. బౌద్ధంలో ఇది ఒక్కటే మోక్షసాధనం, జ్ఞానానికి భక్తికి అంతటి ప్రాధాన్యం బౌద్ధంలో లేదు.

ప్రస్తుతం దేశంలో అధర్మం విపరీతంగా పెరిగిపోయింది. ప్రజల హృదయాలను మార్చడానికి క్రొత్తసందేశం ఒకటి అవసరం. బుద్ధుని సందేశం అలాటిది అన్నభావం అనేకులలో లలో వ్యాపించి ఉంది. అందువల్లనే బౌద్ధమతం పట్ల ఎక్కువ ఆదరం కలుగుతున్నది.

23. మనిషి మరణానంతరము అతని ఆత్మ భూతముగా మరొక బ్రతికివున్న మనిషిని ఆవహించుట మీరు విశ్వసిస్తారా ?

నేను విశ్వసించను. విశ్వసించడానికి తగిన ఆధారాలు లేవు. మసూచికానికి కలరాకు క్షుద్రదేవతల క్రోధం కారణం అని—నిజమైన కారణం తెలియని రోజులలో—అనుకొనేవారు. మనస్సు చెడడంవల్ల కొందరు ఏదో ప్రేలుతూ ఉంటారు; పిచ్చి పిచ్చి పనులుచేస్తూ ఉంటారు. కారణం ఫలానిది అని తెలియక పోవడంచేత— ఏదో దయ్యం వారిని పట్టిందని అనుకొనడం జరుగుచున్నది. ఇది నిజంకాదు.

**30.** స్తూపములనుండియే దేవాలయాలు ప్రచారని కొందరు, కాదు; దానికి పూర్వమే దేవాలయములున్నవని కొందరు అంటారుగదా ? ఇందేది సత్యమో వివరించెదరా ?

స్తూపాలకు పూర్వమే దేవాలయము లున్నవనడమే సత్యము. గృహ్యసూత్రాలలో దేవాలయ ప్రశంస ఉన్నది. గృహ్యసూత్రాల కాలం, బౌద్ధస్తూపాలకంటె ప్రాచీనం.

**31.** శంకరాది మతకర్తలకు జరగని మహావైభవం బుద్ధునికి జరుగుటకు కారణమేమి ?

కారణం ఊహించడం కష్టసాధ్యం, ఈ వైభవమంతా ప్రభుత్వ సాధనాన జరిగిందికదా ? ఈ కాలంలో బౌద్ధమతం ఆగ్నేయ, ఏషియా దేశాలలోను, జపానులోను, కొంతవరకు చచ్చీ చావకుండా చైనాలోను ఉంది. ఈలాటి విదేశాలలో మన పలుకుబడిని వృద్ధిచేసుకొనడానికి మన దేశములోని బుద్ధ జయంత్యుత్సవాలు కొంతవరకు తోడ్పడ్డవి. శంకర జయంతి గాని ఇతర మతకర్తల జయంతులుగాని ఇట్టి ప్రయోజనాన్ని సాధించలేవు.

**32** శాతవాహనులు తమ ప్రాకృతంపైకన్నా సంస్కృతంపై మోజు చూపి, ఎక్కువగా ఆదరించడానికి ఆనాడు గల కారణాలు ఏవంటారు ?

ఆలాటి మోజు వారు చూపలేదు. వారి శాసనాలన్నీ ప్రాకృతంలోనే ఉన్నవి వారి కాలంలో వ్రాయబడ్డ గ్రంథాలు కూడా చాలావరకు ప్రాకృతంలోనే ఉన్నవి.

**33. తరతరాలుగా తాత ముత్తాతలనుండి హిందూమతంలో వుంటూ వేతు అంబేద్కారు పంపతులు వారితో మరి మూడులక్షలమంది బౌద్ధ మతాన్ని స్వీకరించడానికి కారణమేమిటి ?**

(1) పుట్టుకనుబట్టి కొందరు అధికులు కొందరు అల్పులు అని ప్రతిపాదించే వర్ణధర్మం హిందూసంఘంలో ఉన్నదని అందుచేత అవర్ణులెప్పుడూ సవర్ణులతో సమానులు కావడం హిందూ మతం అంగీకరించదని ఒకకారణం, (2) హిందూమతం ఆస్తిక మతం, భగవంతుడొకడున్నట్లు శివుడు విష్ణువు మొదలైనవారు భగవంతుని అవతారములైనట్లు చెప్తుంది. కాని ఈ సిద్ధాంతంలో సత్యంలేదన్న కారణం రెండవది; (3) పితృదేవతలున్నట్లు శ్రాద్ధాదిపై కృతకర్మలద్వారా వారిని తృప్తిపరచవలసినట్లు హిందూమతం చెప్తున్నదనేది మూడవకారణం. ఈలాంటి కారణాలమూలాన అంబేద్కరు దృష్టిలో హిందూమతం లోపభూయిష్టమైంది. బౌద్ధంలో ఈలాంటి లోపాలు లేవు. అది వర్ణవ్యవస్థనుగాని, భగవంతుడున్నాడని కాని అంగీకరించదు. అందుచేత ఆయన, ఆయన అనుచరులు బౌద్ధమతంలో చేరినట్లు ఆయన చెప్పారు. కాని (1) సంఘంలోని ఈ లోపాలన్నిటికీ హిందూమతమే కారణమన్నవాదం నిలవదు. ఈలాటి విభేదాలు నమ్మకాలు ఇతర మతాలలోకూడ ఉన్నవి. (2) బౌద్ధులలో అత్యధికభాగం "బుద్ధుడు భగవంతుడని, భగవదవతారమని నమ్మేవారు. విగ్రహారాధన చేసేవారు. ఇంతకూ ఎవరు

ఏ మతం అనుసరిస్తున్నారనేది వ్యక్తికి సంబంధించిన విషయమే కాని, సంఘానికి సంబంధించినది కాదు. హరిజనులందరూ బౌద్ధులని పేరుపెట్టుకొన్నంత మాత్రాన అస్పృశ్యత తొలగదు. ఇది తొలగడానికి మార్గాలువేరు. దానిని అంబేద్కారు గ్రహించలేదు. బౌద్ధమతాన్ని అనుసరిస్తూ వుండే సింహాళం లోను బర్మాలోను లోపములు లేవని వారు చెప్పగలరా ?

34. రామకృష్ణ పరమహంస వివేకానందుల వారి బోధనలలో ప్రముఖాంశాలెవ్వి ?

పాశ్చాత్య విద్యాసంపర్కం మూలమున బ్రిటిష్ వారి రాజకీయాధికారము మూలముననుు సనాతనమైన హిందూ మతములోప భూయిష్టమైనదనిన్నీ, దానిని వదలి క్రైస్తవమతమందు చేరుటయో, నాస్తికులగుటయో తరుణో పాయమనిన్నీ విద్యావంతులు భావించుచుండిన కాలములో రామకృష్ణ పరమహంసలు హిందూమతముయొక్క ఉత్కృష్టతను, అన్ని మతములు ఒకేవిధమైన సత్యములను ప్రతిపాదించు చున్న వను విషయమును, అందుచేత హిందూమతమును వదలి పరమతముల స్వీకరించుట ప్రాజ్ఞుల లక్షణము కాదనిన్నీ, యోగ సాధనచేత తత్వము తెలుసుకొని మోక్షమును సాధించ వచ్చునని బోధించారు. ఈ ఉపదేశమునే వివేకానందులవారు బలపరచి, హిందూమతముయొక్క ఉత్కృష్టతను ప్రపంచము

నకు ప్రకటించారు. హిందూ మతమునకు ఆధారమైన అద్వైత వేదాంతమే వారిద్దరి తత్వము.

**౪౬.** బౌద్ధులలో ఒకవర్గమువారు బాహ్య ప్రపంచముతోపాటు అంతరీ ప్రపంచము కూడా కలదని విశ్వసించుట బుద్ధుని మూల సిద్ధాంతములకు వైరుధ్యంకాదా ?

ఈలాటి విశ్వాసము కలవారు తమ విశ్వాసమునను బుద్ధుని మూల సిద్ధాంతములతో సమన్వయం చేస్తూఉన్నారు. గమనించవలసిన విషయమేమంటే—మత కర్తలెవరు కూడా—సమగ్రమైనట్టియు సంపూర్ణమైనట్టియు తత్వమును ప్రతిపాదించియుండలేదు. ఏవో కొన్నిటిని మాత్రమే—వారివారి కాల పరిస్థితినిబట్టి—ఉద్ఘాటించారు. కాని ప్రజలకు కావలసినది సమగ్రమైన తత్వము, ఇదిగాక ఏ మత కర్తకూడా, ఆతనికి పూర్వమున ఉండిన సిద్ధాంతము లన్నిటిని నిరాకరించలేదు. అందుచేత ప్రతిమతమూ పరిపరి విధములుగా వృద్ధిపొందడం సాధారణం. సజీవమైన ప్రతిమతంలోను రకరకములైన సిద్ధాంతములకు ప్రవేశముండును. వీటిలో ఏవి మూలసిద్ధాంతములో ఏవికావో విచక్షణ గావించుట సాధ్యముకాదు. సాధ్యమైనా దానిమూలమున ప్రయోజనము లేదు. దాని జన్మకాలమున ప్రచ్ఛన్నముగ నుండు శరీర లక్షణములు వయస్సు వచ్చిన తర్వాత స్పష్టమగును గదా ! అంత మాత్రముచేత అవి అసహ

జములని భావింపము. జన్మకాల మందలి మతమునకును వృద్ధి గాంచిన మతమునకును ఇట్టి భేదము తప్పదు.

**36.** ఇక్ష్వాకు వంశస్థులలో మొదటిరాజు శ్రీ వశిష్ఠపుత్ర శాంతిమూలుని కొడుకు వీరపురుషదత్తుడు బౌద్ధభిక్షువునుండి బ్రాహ్మణ సన్యాశిగా మారిపోయిన తదుపరి బౌద్ధమత ప్రాబల్యాంతర్గ నారంభించిందా? ఆతని కొడుకు బాపరుబలుడు బౌద్ధుడుగానే ఉన్నాడా? లక్షలాది దానం చేసింది శ్రీ వశిష్ఠ పుత్రశాంతి మూలుడేనా?

ఈ రాజులను బ్రాహ్మణ మతావలంబికులని, బౌద్ధులని పేర్కొనడం యుక్తముకాదు. రెండు మతములందు ఆదరణము కలవారనే చెప్పవలెను. అశ్వమేధయాగము చేసినంత మాత్రముచేత బౌద్ధ విరోధియని చెప్పుట పొసగదు. అశ్వమేధ యాగము రాజకీయ ప్రాధాన్యముకలది. విజేత అన్నదానిని వ్యక్తముచేయు చిహ్నము. లక్షహాలము దానముచేసిన వాడితడే.

**37.** ప్రాపంచిక వ్యాపారలలో నిమగ్నుడై, బాధ్యతా యుతుడైన మానవుడికి మనశ్శాంతితో కూడిన జీవితం గడుపుతూ మోక్షం సాధించడానికి మార్గం ఏదంటారు?

ప్రాపంచిక వ్యాపారాలలో నిమగ్నుడైనవాడికి శాంతి లభించదు. అతడు మోక్షాన్ని సాధించలేడు. శరీర ఆరోగ్యానికి మనో వికాసానికి కుటుంబ బాధ్యతను నిర్వహించడానికి ఏలాటి వ్యాపారాలు అవసరమో వాటిని మాత్రమే అతడు

జరిగిస్తూ వుండడంతో తృప్తిపడి వుండవలెను. కాలాన్ని అంతా ఈ వ్యాపారాలలో వినియోగించేవాడికి పరమార్థం ఏదో తెలుసుకొనడం గాని, దానిని సాధించడంగాని వీలుకాదు పరమార్థం తెలుసుకొనడం, దానిని సాధించడమే మోక్షం. దానికిగాను ప్రయత్నం చేయడమే మీరు వాంఛించవలసిన మార్గం.

38. హిందూ బౌద్ధమతాలు స్త్రీపట్ల చూపిన దృష్టియొక్క తారతమ్యత సుబోధకంగా వివరించ కోరిక.

హిందూమతం ఋగ్వేదకాలాననుండి ప్రారంభం అవుతూ వున్నది. అది క్రమక్రమంగా ఎన్నో మార్పులు పొందింది. స్త్రీపట్ల అది చూపిన దృష్టికూడా కాలానుసారంగా మారుతూ వచ్చింది. ఇదిగాక, హిందూసంఘంలో స్త్రీల స్థానం అప్పుడప్పుడూ మారుటకు మతమొక్కటే కారణమని చెప్పుటకు వీలులేదు. దేశంలో కలిగిన ఆర్థిక పరిణామము, విదేశీయుల దండయాత్రలు— వీటిమూలంగాకూడ సంఘంలో స్త్రీలకుగల గౌరవములో అనేకమార్పులు కలిగినవి. మొత్తముమీద గమనించతగ్గది ఏమిటి అంటే; బహుప్రాచీన కాలములో స్త్రీ అన్ని రంగాలలో—మతము విద్య కుటుంబము—పురుషునితో సమానముగా గౌరవింపబడేది. క్రమక్రమంగా పురుషుని ప్రాధాన్యం అధికమైంది. పురుషసంతానమే వాంఛనీయమనే భావము, బాల్యవివాహము, పునర్వివాహనిషేధము, పాతివ్రత్యమొక్కటే

ముక్తిసాధనమను సిద్ధాంతము, సహగమనాచారము, మొదలైనవి పురుషుని ఆధిక్యమును స్పష్టపరచుచున్నవి. బౌద్ధమతము మూలమున వీటియందు ఎక్కువ మార్పు కలుగలేదు. స్త్రీలు కూడ సన్న్యాశినులై బౌద్ధ సంఘంలో చేరుటకు గౌతమబుద్ధుడు అవకాశము కల్పించెను. ఇంతకంటే బౌద్ధమతము మూలమున వచ్చినమార్పు ఏలాటిదియులేదు. పురుషులతో సమానత్వము స్త్రీలకు ఉండరాదన్న భావము ఇటీవల వరకు అన్ని దేశములలో వ్యాపించియుండెను. ఇది హిందూ సంఘపు ప్రత్యేక లక్షణముకాదు.

39. మాతృమూర్తి స్త్రీని మోక్షసాధనకు అడ్డంకిగా తలచడం అపచారం కాదంటారా ?

ఇది అపచారమే- కాదని ఎవరూ సాహసించి చెప్పజాలరు- స్త్రీకి ప్రత్యేకముగనుండు రంజోదర్శనాది లక్షణముల నిజ స్వభావమును తెలుసుకొనలేని ప్రాచీనకాలపు మానవుడు ఆమె అపవిత్రురాలన్న భావమును కలవాడయ్యెను. ఈ అపచారమునకు ఆ అజ్ఞానమే ప్రధాన కారణము. మోక్షసాధనకు పురుషునిలోని కామాది మనోవికారములు అడ్డంకులుగాని, స్త్రీకాదు.

40. శైవసిద్ధాంతము బౌద్ధజైన మతముల అభివృద్ధిని ఏవిధంగా ఆటంకపరచిందో తెలియపరచగలరా ?

శైవ సిద్ధాంతము ఈరెండు మతముల అభివృద్ధిని ఎక్కు-వగా ఆటంకపరచి యుండలేదు. శైవము ప్రబలు నాటికి జైన బౌద్ధములు క్షీణదశయందు ఉండినవి. శైవము ప్రబలకుండినను వాటిక్షయము తప్పేదికాదు. దీనికి ప్రధానకారణము వాటి మూలసిద్ధాంతములను—ముఖ్యముగా బౌద్ధుల శూన్యవాదము, అనాత్మవాదము మొదలైన సిద్ధాంతములను—సమర్థించశక్తిగల విజ్ఞానులు లోపించిపోవుటయే—7వ శతాబ్దినాటికి బౌద్ధమతము లనేకములు పాడుపడియుండెను మంచి స్థితిలో నుండిన మతములలోని సన్యాసులు వాద ప్రతివాదములందు జయించగల పాండిత్యము లేనివారైరి– అందుచేతనే శంకరుని వంటివారికి దిగ్విజయము తప్పదయ్యెను. శైవసిద్ధాంతములో సత్యమున్నదా ? లేక బౌద్ధములో సత్యమున్నదా అన్న ప్రశ్నకు సర్వజన సమ్మతమగు జవాబునియ్యగల వారెవరున్నారు ? బౌద్ధమత సిద్ధాంతములలో సత్యమే లేనియెడల 14, 15, వందల సంవత్సరముల కాలము ఆ మతము మనదేశములో ఎట్లు నిలబడగలిగియుండెను ? ఇప్పటికికూడ అది సింహళము, బర్మా మొదలైన దేశములలో ఎట్లు నిలబడగలిగి యున్నది ? జైన బౌద్ధములను చక్కగ బోధించగలవారును, నీతి విషయములందు ప్రజలకు మార్గదర్శకులుగ నుండతగినవారును జైనపల్లెలందును బౌద్ధసంఘారామములందును లేనికారణము

వనే శైవమునకు ప్రాబల్యము లభించెను. ఆ కారణముచేతనే మొదటి శైవము తర్వాత వైష్ణవము, ప్రభువులను ప్రజలను ఆకర్షించగలిగెను.

41. శూన్యవాద మన నేమిటో తెలియపరచ గోరుతాను.

శూన్యవాదం అనేక రంగాలలో కనుపిస్తుంది. ముఖ్యంగా మతరంగంలోను రాజకీయ రంగంలోను ఈ వాదాన్ని నిలబెట్ట డానికి గొప్ప ప్రయత్నం జరిగింది. సృష్టిస్థితిలయాలకు మూల కారణంగా బ్రహ్మపదార్థం అనేవి ఏదీ లేదనిన్నీ, బంచభూత మయమైన శరీరంతప్ప ఆత్మ అనేది ఏది లేదనిన్ని, నిరూపించే తత్వానికి శూన్యవాదం అనిపేరు. కొంతవరకు దీనినే నాస్తిక వాదం అని చెప్పవచ్చు. ఈవాదం మనదేశంలో బౌద్ధమత మందు ఎక్కువగా కనుపిస్తుంది. బ్రహ్మపదార్థం ఒకటి ఉన్నదని నిరూపించగలగడంచేతనే శంకరుని వంటివారు బౌద్ధమతాన్ని ఖండించగలిగారు. రాజకీయ రంగంలో ఈ వాదం 19 వ శతాబ్దమధ్యభాగంలో రషియా దేశంలో తలఎత్తింది. టర్ జన్యూ రచించిన ఫాదర్స్ అండ్ సన్సు అనే నవలమూలంగా (1862) ఈ వాదానికి వ్యాప్తి కలిగింది. మానవుని స్వాతం త్ర్యానికి భంగం కలిగించే స్వభావంగల రాజ్యాధికారం అనేది ఉండరాదని ఈ వాదం ప్రతిపాదిస్తుంది. రాజ్యాధికారం మూలంగా వ్యక్తులకు ప్రజలకు ఏలాటి లాభం చేకూరడంలేదనీ,

ప్రజలను వశంచేసుకొని వారిద్వారా స్వప్రయోజనాన్ని సాధించుకొనడానికి అధికారుల నిర్మాణం చేసుకొన్న సాధనమే రాజ్యమనిన్నీ, రాజ్యమన్నది లేనిస్థితియే మానవునికి విముక్తి అనిన్నీ ఈవాదం ప్రతిపాదిస్తుంది. మానవులందరు స్వలాభపరత్వం లేక స్వార్థత్యాగంచేసి, తోడి మానవుల శ్రేయస్సుకై సర్వదా పాటుబడగలరన్న విశ్వాసమే ఈ వాదానికి పునాది. ఈ విశ్వాసం సహేతుకమైనదా అన్నదే విచారించతగ్గవిషయం.

**42.** మానవ జీవితమునందు సుఖదుఃఖములు, చావు బ్రతుకులు ఎందువలన కలుగుచున్నవి ? ఉమర్ ఖయ్యాం చెప్పిన ప్రకారము మరణానంతర జీవితమనునది లేదని చెప్పినారు. ఈ విషయమై మీ అభిప్రాయమేమిటి ?

సుఖ దుఃఖములు, చావు బ్రతుకులు మానవజీవితమునకు సహజలక్షణములు. మరణానంతరం జీవితం ఉన్నదని మనం అంగీకరించినా, అంగీకరించక పోయినా, ఈ లక్షణాలనుండి తప్పించుకొనడం అనేది సాధ్యంకానిపని. మనం కోరవలసింది మనశ్శాంతి. మన జీవితంలో శాశ్వత సుఖం అనేది ఉండదనిన్నీ, దుఃఖాలు కష్టాలు తప్పవనిన్నీ, పుట్టిన వారందరూ తప్పకుండా చావవలసి ఉన్నదనిన్నీ గ్రహించి, దుఃఖములు సంభవించినప్పుడు ఆందోళన పడక, చావు వస్తుందని భయపడక మనశ్శాంతితో ప్రవర్తించడమే ప్రాజ్ఞత ఇదే మోక్షము. ఈలాటివాడు దుఃఖాలకు చావుకు అతీతుడౌతాడు.

43. శాతవాహన యుగము. విజయనగర యుగము, ఈ రెండింటిలో ఏయుగమందు ప్రజలు సుఖముగా జీవించిరి ?

దీనికి సమాధానం చెప్పడంలో "సుఖము" అనే మాటకు అర్థం ఏమిటో గ్రహించవలసివుంది. కడుపునిండా ఆహారం కట్టుకొనడానికి వస్త్రం నివాసం చేయడానికి ఇల్లు. విలాసంగాను వినోదంగాను కాలం గడపడానికి కావలసిన సాధన సామగ్రి ఎవరికి లభిస్తుందో వారు శరీర సౌఖ్యం కలిగి జీవిస్తారు. ఇవి కనీస అవసరాలు. ఇవిగాక ఇరుగు పొరుగువారి సహకారం, స్నేహం సోదరభావం—ఇవికూడా సుఖసాధనాలు. ఇవి లేకుంటే జీవితం సుఖంగా గడవదు. ఈ రెండు విధములైన సుఖసాధనాలు ఏయుగంలో ఎక్కువగా లభ్యం అవుతూఉండినదీ చెప్పడానికి కావలసిన చారిత్రక సాధనాలులేవు. ఉన్న సాధనాధనాలనుబట్టి శాతవాహన యుగంలోనే ప్రజలు ఎక్కువ సుఖంగా జీవించారని చెప్పవచ్చు. ఆ కాలంలో జనసంఖ్య తక్కువ; వ్యవసాయం చేసుకొనదలచిన వారికి సమృద్ధిగా భూములు లభిస్తూ ఉండేవి. రాజులు విధించే పన్నులు, తక్కువగా ఉండేవి. బౌద్ధమత వ్యాప్తివల్ల ప్రజలలో ధర్మబుద్ధి ఎక్కువగా ఉండేది. కులవైషమ్యాలు, వర్గవైషమ్యాలు మొదలైన వాటికిఎక్కువ అవకాశంలేదేమో ! విజయ నగర సామ్రాజ్య కాలంనాటికి ఈ పరిస్థితులు చాలవరకు మారిపోయినవి. భూస్వాములు, అధి

కారులు, మొదలైన వారితో కూడిన ధనికవర్గం ఏర్పడ్డది. పన్నులభారం ఎక్కువ అయింది; యుద్ధాలుకూడా పెరిగిపోయినవి. సామాన్య ప్రజల జీవితం కష్టంతో కూడుకొని పోయినది. కాని, కర్మసిద్ధాంతం ప్రబలి ఉండడంచేతను, ఏకష్టం వచ్చినా దానికి కారణం పూర్వజన్మలో చేసిన కర్మకారణం అనే విశ్వాసం ఉండడంచేతను, కష్టపడ్డా మనశ్శాంతి ఉండేది. సుఖసాధనాలలో మనశ్శాంతికూడా ఒకటి. విజయనగరంయుగం నాటికంటే ఇప్పటికాలంలో శరీర సౌఖ్యానికి కావలసిన వస్తుసామగ్రి ఎక్కువగా లభిస్తూవున్నా సామాన్యులుగాని ధనికులుగాని సుఖంగా జీవించడంలేదు. తృప్తి అనేది లేకపోవడంచేత ఇట్టి పరిస్థితి ఏర్పడ్డది.

**41. క్రిష్టియానిటీ మాదిరిగా హిందూమతం వ్యాప్తిచెందే గుణాన్ని కోల్పోయిందా ?...ప్రపంచంలో నలుమూలలా క్రిష్టియానిటీ వ్యాపిస్తూంటే మన దేశంలో హిందువులసంఖ్య తగ్గిపోతూ ఉండడానికి కారణమేమిటి ?**

ఇతర మతస్థులను హిందూమతంలోకి చేర్చుకొనవలెననే ఉద్దేశం. హిందూమతానికి చాలాకాలంక్రిందటనుండిలేదు. అన్ని మతములలోను సత్యం ఉన్నదని! ఏ మతాన్ని అనుసరించినా మనం చేరే గమ్యస్థానం ఒక్కటే అని హిందూమతం యొక్క సిద్ధాంతం. గనుక క్రిష్టియానిటీ మొదలైన మతాలవలె ఇది వ్యాప్తిచెందటం సాధ్యంకాదు. ఇది మనదేశానికి మాత్రం

పరిమితమై ఉండడానికి ఇదే కారణం. ప్రాచీనకాలంలో దీని స్వభావం భిన్నంగా ఉండడంచేత ఆగ్నేయ ఆశియా దేశాలలో హిందూమతం వ్యాపించివుండినది. హిందూమతాన్ని ప్రచారం చేయగలవారు కొందరు అమెరికావంటి విదేశాలకు ఇటీవలి కాలములో వెళ్ళి శిష్యుల కొందరిని సంపాదించారు. కాని వీరి సంఖ్య చాల తక్కువ. మన దేశములో హిందువులసంఖ్య తగ్గినట్లు కనిపించదు. ఒకవేళ తగ్గినా దీనికి కారణం క్రీస్తుమతం కాజాలదు. క్రీస్తుమతాన్ని ప్రచారంచేసే విదేశమిషనరీలకు ఇది వరకున్నంత పలుకుబడి ఇకమీదట ఉండదు. "మతమే అక్కర లేదు; మానవుని కష్టాలన్నిటికీ మతమేకారణం" అని బోధించే కమ్యూనిజంవంటి నాస్తికవాదం వ్యాప్తిగాంచడంవల్ల హిందూ మతానికి ప్రమాదం కలుగుతుంది. దీన్ని ప్రతిఘటించగలితే హిందూమతం నిలబడుతుంది. హిందువులుగా ఉండేవారు, ఉంచదలచుకొన్నవారు గ్రహించవలసిన సత్యం ఇదే.

**45.** మన దేశంలో క్రైస్తవ మిషనరీల విపరీతమయిన ప్రచారానికి వస్తుతంమాదిరి అవకాశం కల్పించడం సబబేనంటారా ? హిందూ దేవాలయాల ద్వారంవద్ద పరమత ప్రచారదూషణ సహించడం ప్రజాస్వామికభాగమే నంటారా ?

శాంతియుతంగా మతప్రచారం చేయడంలో సబబుకాని దేమీలేదు. పూర్వంకంటె ఇప్పుడు మిషనరీలు యెక్కువ విపరీ

తంగా ప్రచారము చేస్తున్నారనుకొనుటకు కారణాలు లేవు. వైపరీత్యం తగ్గుముఖంలోకి వచ్చింది . వారి ప్రచారము దూషణలో కూడుకొన్నప్పుడు అది యెక్కడ జరిగినా— దేవాలయ ముఖద్వారం వద్దనే కాదు—ప్రతిఘటించదగ్గది. ప్రచారములో పరమత దూషనకు స్థానంకాని అవకాశముగాని ఉండరాదు. అది చట్టవిరుద్ధముకూడా.

**46.** వేదకాలంనుండి బ్రాహ్మణులు నిరంకుశులై సమాజాన్ని తమకు ఇచ్చవచ్చిన రీతిని నడిపించె వాస్తవమా ?

ఇది వాస్తవముకాదు. సమాజమంతా బ్రాహ్మణులు చెప్పినట్లు నడుచుకొనుచుండిరని చెప్పుట భ్రమ. ప్రతి సమాజం అనేకరంగాలలో పనులు చేస్తూవుంటుంది. ఆహారాది వస్తువులను. వ్యవసాయాదుల ద్వారా ఉత్పత్తిచేసి, వినియోగించుకొనడం ఆర్థికరంగం. ఇందులో బ్రాహ్మణులకు ఏలాటి జోక్యం ఉండేది కాదు. ఎవరి వృత్తులను వారు తరతరాలుగా గడించిన అనుభవాన్ని ఆధారం చేసుకొని అనుసరిస్తూ ఉండేవారు. రాజకీయ రంగంలో అధికారం చాలావరకు రాజుల చేతులలో ఉండేది. మంత్రిపదవులలో బ్రాహ్మణులు కొందరు ఉండేవారు. వారు రాజులకు సలహాల నిచ్చుచుండువారు. కాని ఆ సలహాలను తప్పకుండా రాజులు శిరసా వహించిరని చెప్పుటకు ఆధారములులేవు. బ్రాహ్మణులేగాక ఇతర వర్ణములవారు కూడ

మంత్రివర్గంలో వుండేవారు. మూడవది సాంఘికరంగం కుటుంబ విధానం, వివాహాలకు సంబంధించిన ఆచారాలు మొదలైనవి ఈ రంగంలోనివి. వీటి విషయములో ఏ కులానికి ఆ కులం స్వతంత్రంగా వ్యవహరించుకొంటూ ఉండడమే మన ప్రాచీన సమాజంలోని విశిష్టత. కులాచారాలకు విరుద్ధముగా నడుచు కొన్నప్పుడు అట్టివారిని ఆయాకులములోని పెద్దలు శిక్షిస్తూ ఉండేవారు... బ్రాహ్మణులకు అందులో ఏలాటి ప్రసక్తి ఉండేది కాదు. నాల్గవది కళారంగం: శిల్పం, సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలయినవి ఇందులో చేరినవి. వీటిలో బ్రాహ్మణులకు ప్రత్యేకంగా ఏలాటి జోక్యం వుండేదికాదు. ఐదవది ఆధ్యాత్మికరంగం; మతానికి సంబంధించింది. సమాజంలో ప్రజలు విశ్వసించిన మతసిద్ధాంతములు; వారు అనుసరించిన కర్మ కలాపాలు బ్రాహ్మణులొక్కరే సృష్టించి విపులపరచారని చెప్పుటకు వీలులేదు. లింగపూజ, గ్రామశక్తుల పూజ, జాతరలు, తపస్సు యోగము మొదలైనవి ఆర్యులు రాకపూర్వము దేశమందుండిన మతానికి లక్షణములు. కర్మ సిద్ధాంతము పునర్జన్మమునకు సంబంధించిన సిద్ధాంతములు, ఎవరు ఏ కాలంలో ప్రతిపాదించారో చెప్పుటకు వీలులేదు. జంతుబలుల ద్వారా దేవతలను తృప్తిపరచి, వారి అనుగ్రహాన్ని సంపాదించవచ్చునను నమ్మకం వర్ణధర్మం ఏర్పడని బహుప్రాచీన కాలమునుండి వుంటూ వచ్చింది. దానికి బ్రాహ్మణులు కర్తలు కారు, గనుక

ఏ రంగంలోకూడా నిరంకుశత్వంగా బ్రాహ్మణులు సమాజంపై అధికారాన్ని వహించి ఉండినవారని చెప్పుటకు అవకాశంలేదు. హిందూసమాజ నిర్మాణం ఏకులానికి ఆకులమే సర్వ స్వాతంత్రం కలది అన్న సూత్రంపైన నిర్మాణం కాబడ్డది. నిరంకుశత్వా నికి అందు అవకాశమేలేదు. ప్రజలలో చాలాభాగం గ్రామా లలో నివసిస్తూఉండేవారు. గ్రామ వ్యవహారాలను గ్రామపంచా యతీలు చక్క-బెడ్తూఉండేవి ఈ పంచాయతీలలో అన్నికులాలకు ప్రాతినిధ్యం ఉండేది. బ్రాహ్మణుల నిరంకుశత్వానికి వాటిలో స్థానంలేదు. పంచాయతీలులేని గ్రామాలు పెద్దరెడ్లయొక్క-గాని భూస్వాములయొక్క-గాని అధికారానికి లోబడి ఉండేవి.

**47. భారత భాగవత కృష్ణుల వైశిష్ట్యమేమి ?**

భారతములోని కృష్ణుడు గొప్ప రాజకీయ వేత్త, పాండవులకు సచివుడై, అర్జునికి ప్రాణమిత్రుడై కష్టములనుండి వారిని రక్షించుటకు కావలసిన ఉపాయములను కల్పించిన వాడు... మహాభారత కాలమందలి రాజనీతి ఎలాటిదో భార తములోని శ్రీకృష్ణుని చర్యలు స్పష్టపరచుచున్నవి. భాగవతము లోని శ్రీకృష్ణుడు భగవదవతారముగ చిత్రించబడినవాడు. భగ వంతుని మహిమ, భక్తులయెడ భగవంతునికి గల ప్రేమ, భక్తులయొక్క లక్షణములు—వీటిని కథావస్తువుగ భాగవతము శ్రీకృష్ణుని జీవితమును వివరించుచున్నది.

**48. ఐదుగురిని పెండ్లాడిన ద్రౌపదిని పతివ్రత అని నిర్ధారించడ మెట్లు ?**

ఎట్టి పరిస్థితులలో ద్రౌపది అయిదుగురిని పెండ్లాడ వలసివచ్చెనో, అందులోని ధర్మాధర్మములు, దానికి సంబంధించిన పుట్టుపూర్వోత్తరాలు—వీటినన్నిటిని భారతము వివరిస్తున్నది. ఈ వివాహము ఒక ప్రత్యేక సంఘటనమని భావించ గాదు. దీనికి మూలము ద్రౌపదియొక్క పూర్వజన్మమట. "మీరు తెచ్చిన భిక్షను మీరైదుగురు ఉపయోగించుకొనుడు" అని తల్లియైన కుంతీదేవియొక్క మాటను జవదాటుటకు పాండవులు ఇష్టపడకపోవుట. మాతృవచనము అలంఘనీయమన్న సూత్రముయొక్క ప్రభావము; ధర్మరాజు నోటినుంచి అధర్మమెన్నడు వెలువడదను సమ్యకము; వేదవ్యాసుని హితవు; వీటి అన్నిటితో సమన్వయము చేసిగాని, ఈ వివాహములోని విశేషమును తెలిసికొనుట సాధ్యము కాని పని. ఆదిపర్వములో సప్తమాశ్వాసాన ఈ ఘట్టమునకు సంబంధించిన వృత్తాంతము. అరణ్యపర్వములోని సత్యా ద్రౌపదీ సంవాదము మీరు చదివిన యెడల మీ సందేహము నివృత్తి కాగలదు. నారదుని ఉపదేశము ననుసరించి పాండవులు ద్రౌపది విషయమై చేసుకొన్న నియమము కూడ యీ సందర్భములో గుర్తించతగియున్నది.

49. వర్ణాశ్రమ ధర్మాలను పాటించడం అవసరమంటారా ? ఇవి ఎవరు ఎప్పుడు ఏర్పరిచారు ?

వర్ణధర్మాలను పాటించడం అవసరంకాదు, ఎవరూ పాటించడంలేదు. పూర్తిగా వర్ణాన్ని బట్టి ఎవరూ వృత్తిని నిర్ణయించుకోనడంలేదు.

ఎవరు ఏ వృత్తికి అర్హులో వారు ఆ వృత్తిని అనుసరించడం లాభకరం. ఇప్పుడు ఈలాగే జరుగుతున్నది. ఏ వర్ణంవారు ఆ వర్ణంలోనివారినే వివాహమాడడం ఇదివరకు ధర్మంగా ఉండేది. ఇప్పుడు వర్ణాంతర వివాహాలు జరుగుతున్నవి. వీటిని ఆక్షేపించేవారి సంఖ్య తగ్గిపోతున్నది. సంఘంలో గౌరవాగౌరవాలకు వర్ణం ఇదివరకు కారణంగా ఉండేవి. ఇదికూడా మారిపోయింది. బ్రాహ్మణుడన్న కారణంచేత పూజ్యుడన్న భావం ఈ రోజులలో ఎవరికీలేదు. అస్పృశ్యత దోషమని అందరూ భావిస్తున్నారు. అందుచేత వర్ణధర్మాలు అవసరంలేదని స్పష్టం అవుతున్నది. మరి ఆశ్రమధర్మాలు ఎన్నడో నశించిపోయినవి. ఈ ధర్మాలను ఎవరో ఒకరు ఒక కాలంలో ఏర్పర్చలేదు. అవి కాలక్రమాన ఏర్పడినవి.

50. బౌద్ధమత వ్యాప్తికి బుద్ధుడు మన దేశం అంతా తిరిగాడా ? ఆయన కాలంలో బౌద్ధం వ్యాపించిన ప్రాంతా లేమిటి ? బౌద్ధవ్యాప్తి నరికట్ట డానికి హిందూమతం తీసుకొన్న శ్రద్ధఏమిటి ?

బుద్ధుడు దేశమంతా తిరుగలేదు ఇప్పటి బీహారు రాష్ట్రము, ఉత్తర ప్రదేశ్‌లోని కాశీ కోసల ప్రాంతాలు మాత్రమే ఆయన సంచారం చేసిన ప్రదేశాలు. ఈ ప్రాంతాల లోనే ఆయన కాలంలో బౌద్ధం వ్యాపించింది హిందూమత సిద్ధాంతాలను ఆచారాలను ప్రజలకు బోధించి దేవాలయములను ప్రతిష్ఠించి హిందూమతమును సులభముగ గ్రహించుటకు కావలిసిన పురాణాది గ్రంథములను వ్రాయడమే హిందూమతం తీసుకొన్న శ్రద్ధ. వైష్ణవ శైవములు క్రీ. పూ. రెండవ శతాబ్దాన నుండి వ్యాప్తిలోకి వచ్చినట్లు తెలుస్తున్నది. బౌద్ధుల నాస్తికవాదాన్ని శూన్య వాదాన్ని ప్రతిఘటిస్తు అనేకులు ప్రచారం చేశారు. శంకరాచార్యులు వారిలో అగ్రగణ్యులు.

**51.** బౌద్ధయుగంలో కొన్ని రాజ్యాల రాచరిక నిర్వహణయందు చేటి ప్రజాస్వామిక సూత్రాలు గోచరించినది నిజమేనా ?

ఆ కాలంలో గణరాజ్యాలనే పేరుతో కొన్ని రాజ్యాలుండేవి. కొన్ని కుటుంబాల వారు అధికారం వహిస్తూ వుండే వారు. రాజ్యానికి అధిపతిని వారు ఎన్నుకొనేవారు. కాని రాజ్యంలోని ప్రజలందరికి పరిపాలనలో భాగం ఉండినట్లు కని పించదు. గణరాజ్యాలు ప్రముఖుల (Aristocratic) పాలనకు లోబడినవి. ప్రజాస్వామ్యాలు కావు.

51. ఈజీవితానికి అర్థం ఏమిటి? మానవుడు దానిని ఏలాగు సాధించ గలడు ? ఆ సాధించిన మానవులు ఇంతవరకు ప్రపంచంలో ఎవరెవరు? చాలా స్పష్టంగా (ఎక్స్ప్లెయిన్) చేస్తూ తెలుపండి.

దీనినంతా స్పష్టంగా ఎక్స్ప్లేయిన్ చేయడానికి అనేక సంపుటాలతో కూడిన గ్రంథం కావలసివుంది. అన్ని కాలాలలో తత్వవేత్త అని ప్రఖ్యాతి గాంచినవారు — ఉపనిషత్తుల వ్రాసిన వారు. బుద్ధుడు, మహావీరుడు, శంకరుడు, రామానుజుడు, చైతన్యుడు, రామకృష్ణ, పరమహంస మొదలైనవారు — దీనిని గురించి విచారణ చేశారు. ఈ జీవితానికి అర్థం ఒకటి ఉన్నదనిన్ని, దానిని సాధించడమే మానవుని కర్తవ్యమని, దానికి కొన్ని సాధనములున్నవని వాటిని ఉపయోగించి మహాత్ములనేకులు తరించారనీ వారి ఉపదేశం. మన జీవితం కష్టాలతోను లోపాలతోను కూడుకొని ఉన్నది, వాటిని లేకుండా చేసుకొని పరిపూర్ణమైనట్టియు శాశ్వత సుఖముతో కూడుకొన్నట్టియు స్థితిలోనికి వచ్చుటయే జీవితంయొక్క అర్థమని చెప్ప వచ్చు. అట్టి పరిపూర్ణత గలవాడే భగవంతుడు. మానవుడు అట్టి పరిపక్వతను సంపాదించ తగ్గవాడు.పరిపూర్ణమైన జ్ఞానం, పరిపూర్ణమైన శక్తి, పరిపూర్ణమైన ప్రేమ,— మనం దేనిని సుగుణములని అనుకొనుచున్నామో వాటినన్నిటిని పరిపూర్ణంగా సంపాదించి పరిపక్వాన్ని పొందడమే జీవిత పరమావధి. పురా

గాలలోను, చరిత్రలోను జ్ఞానులని, మహానుభావులని, రాజర్షులని, యోగులని ప్రఖ్యాతి గాంచినవారు అట్టి పరిపక్వాన్ని పూర్తిగనో లేక అత్యధిక భాగముగనో సంపాదించినవారు. వారే మనకు మార్గదర్శకులు.

**52.** మానవుడు మతసంబంధం లేకుండా బ్రతుకలేక పోవడానికి కారణం ?

(మానవుడు సుఖాన్నే కోరుతాడు, దుఃఖాన్ని కోరడు. కాని జీవితంలో సుఖానికంటె దుఃఖమే యెక్కువగా ఉన్నది. మనంచేసే కృషి. ప్రయత్నం ఫలించకపోవడమే దుఃఖానికి కారణం.) అజ్ఞానంచేత సుఖంకానిది దాన్ని సుఖమని భావించి, అందుకుగాను ప్రయత్నం చేయడంకూడా దుఃఖానికి కారణం అవుతున్నది. దుఃఖం నివారణ కావడానికిన్ని, నిజమైన సుఖాన్ని సంపాదించి అనుభవించడానికిన్ని మార్గమును సూచించేదే మతం. ఒక్కొక్క మతం ఒక్కొక మార్గాన్ని సూచించవచ్చు. కాని అన్ని మతాలయొక్క లక్ష్యం ఒక్కటే. మానవజీవితం దుఃఖంతో కూడుకొన్నది కావడంచేతనే మతం అవసరం అవుతున్నది.

**53.** ప్రస్తుతం ప్రపంచంలో వివిధశాస్త్ర రంగాలలో మానవుడు సాధించిన అత్యున్నత విజయాలకు, ప్రాచీన భారతీయ మహాఋషులు ఆవిష్కరించిన అంశములు, పురాతన భారతీయ ఉద్గ్రంథములు (వేదములు, ఉపనిషత్తు)లలో వ్రాయబడిన విజ్ఞాన విషయాలే ఆధారము కాదా ? అయితే

ప్రపంచ నాగరికతకు ప్రథమ మార్గదర్శకులు భారతీయులే అనుట అతిశయోక్తి కాదంటారా ?

ఈనాటి ఉన్నత విజయాలకు మన పురాతన విజ్ఞానము ఆధారముకాదు; కాజాలదుకూడా. ఇప్పటి పరిశోధకులు మన పురాతన గ్రంథములను పరిశీలించినవారు కారు. ప్రకృతి రహస్యాలను కనుగొనుటకు వారనుసరించిన పద్ధతులకును, పూర్వకాలమున మన ఋషులు అనుసరించిన పద్ధతులకును ఏలాంటి సామ్యము లేదు.

54. మానవచరిత్ర తెలిసినంతవరకు ఇప్పుడున్నంత స్వార్థం, ద్వేషం, ఇంద్రియసౌఖ్యం ఇదివర కెన్నడయినా ఉన్నాయా ? దీనిని నివారించడానికి తగిన విధానం తెలియజేస్తారా ?

ఇప్పుడున్నంత స్వార్థం ఇదివర కెన్నడయినా ఉండినదీ లేనిదీ నిర్ణయించడానికి కావలసిన ఆధారాలు లేవు. ఒకవిషయంమాత్రం చెప్పాలి. కొన్ని యుగాలలో కొన్ని దేశాలలో కొన్ని వర్గాలలో— ముఖ్యంగా సామంత, ధనికవర్గాలలో— స్వార్థం ఇంద్రియ లోలత్వంవిపరీతంగా ఉండినట్లు తెలుస్తున్నది. రోం సామ్రాజ్యంలో రెండు మూడు శతాబ్దాలలో, ఫ్రాన్సులో 18 వ శతాబ్దంలో ఈలాగు ఉండినది. కాని ఇప్పటికీ అప్పటికీ భేదం ఏమిటీ అంటే ఈ కాలంలో ఇంద్రియ లోలత్వం స్వార్థం అనే గుణాలు ప్రపంచమందంతటా అన్ని వర్గాలలో కనుపిస్తూఉండడం. ప్రకృతిశాస్త్ర విజ్ఞానం విపరీతంగా పెరిగి

పోవడం, దానిమూలంగా భోగ భోగ్యాలభివృద్ధి కావడం, ఇంద్రియ లోలత్వానికి ఎక్కువ అవకాశం కల్పించింది. ఉత్పత్తి అయిన వస్తుసామగ్రి అన్ని వర్గాలవారి అందుబడిలోకి రావడంచేత అందరూ ఇంద్రియలోలురు కావడం జరుగుతున్నది. ఐహిక సుఖమే సుఖం, పరలోకం అనేది ఏదీ లేదు అనే తత్వంకూడా ప్రపంచమందంతటా వ్యాపించడంకూడా దీనికి కారణం. దీనిని నివారించడానికి గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు, మహాత్మాగాంధి, మొదలైన మహనీయులు ఎన్నో ఉపాయాలు సాధనాలు నిర్వచించారు. వారి విధానమే మనము అనుసరించతగ్గవి. వాంఛలను తగ్గించు కొనుటయే శాశ్వత సుఖానికి సాధనం అన్న రహస్యాన్ని మానవులందరు గ్రహించినయెడల స్వార్థం ఇంద్రియ లోలత్వం మొదలైనవి అదృశ్యములు కాగలవు.

55. కలియుగం ఆరంభమై ఎన్ని సంవత్సరములైనదో తెలుపగలరా?

ఇప్పటికి 5,057 సంవత్సరాల క్రితం ప్రారంభమైనదని మన పంచాంగాలు చెపుతూనే ఉన్నవి. అంటే క్రీ. పూ. 3100 ప్రాంతాన అన్నమాట. ఆలోచించవలసింది ఏమిటీ అంటే దేని మూలంగా క్రీ. పూ. 3,100 సంవత్సరానికి ప్రాధాన్యం కలిగింది అనే విషయం ప్రతియుగానికి (ఒక సంవత్సరానికి) చిరస్మరణీయమైన గొప్ప సంఘటన కారణంగా ఉంటుంది.

మహాభారత యుద్ధం కలియుగానికి ప్రారంభం అని చెప్పేవారున్నారు. కాని అనేకుల అభిప్రాయం ఏమిటీ అంటే– క్రీ. పూ. 3,100 ఏదో ఒక ప్రళయం సంభవించినదని, దానినుండి తప్పించుకొన్న వైవస్వత మనువుయొక్క పరిపాలన అప్పటినుండి ప్రారంభమైనదని, కలియుగం దీనితో ప్రవేశించింది అని పురాణాలలో వర్ణించిన రాజవంశముల పట్టికలను అధారం చేసుకొని, ఈ కాలపు పరిశోధకులనేకులు ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు. క్రీ. పూ. 3,100 ప్రాంతాన ప్రళయం (Flood) సంభవించినట్లు మెసపటోమియాకు చెందిన గాథలలో ప్రశంస ఉన్నది. అందుచేత ఆ సంవత్సరానికి ప్రాధాన్యం వచ్చి ఉండవచ్చును.

**53.** మానవుని మరణానంతరం అతని ప్రేతాత్మ ప్రతిలోకంలో తిరుగుతుంది అనే వాదంలో వాస్తవముంటుందా? పాశ్చాత్య దేశాల్లోని వైజ్ఞానికులు కొందరు ప్రేతాత్మలతో మాట్లాడామని చేసే ప్రకటనలపై మీ అభిప్రాయం ఏమిటి?

ఈ మాటలలో వాస్తవముందని కాని, లేదని కాని సహేతుకంగా ఋజువు చేయడానికి సాధ్యంకాదు. పాశ్చాత్య వైజ్ఞానికులు పామరజనులను మోసం చేయడానికి ఈలాటి సిద్ధాంతాలను లేవదీశారని చెప్పటానికి వీలులేదు. వారు వారి అనుభవాన్ని ఆధారం చేసుకొనే ఈలాగు చెప్పారు. అయితే ఈలాటి విషయాలలో ఎవరి అనుభవం వారిదేకాని–ఇతరుల కట్టిది

సాధ్యం కాకపోవచ్చు. అంతమాత్రంచేత సిద్ధాంతాన్ని నిరాకరించరాదు. మనం నమ్మే సత్యాలలో అనేకాలు ఈలాటివే. ప్రతి సిద్ధాంతంలో ఋజువు చేయలేని అంశాలు కొన్ని ఉండి తీరుతవి. ఇవి ప్రాచీనకాలమునుండి వస్తూ ఉండే హిందూ మతము, క్రైస్తవమతము, బౌద్ధము, మహమ్మదీయ మతము మొదలగువాటియందు మాత్రమే కాక ఆధునిక కాలమందు తల యెత్తిన లిబరలిజం, సోషలిజం, కమ్యూనిజం మొదలైన తత్వాలలో. కనపించుచున్నవి. ఈ తత్వాలన్నిటిలో మూలధ నమ్మకములని చెప్పతగిన విషయములు కొన్ని ఉన్నవి-ఆలాటి నమ్మకములు లేక మానవుడు జీవించలేడు. పరమాత్మకు సంబంధించిన సిద్ధాంతములుకూడ ఈలాటివే.

57. అహింసను ప్రబోధించే గాంధీజీకి హింసను ప్రబోధించే భగవద్గీత అభిమాన గ్రంధం. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?

భగవద్గీత హింసను బోధించే గ్రంధం కాదు. అది ధర్మాన్ని బోధించే గ్రంధము. క్షత్రియుని ధర్మం యుద్ధం చేయడం. యుద్ధంలో చనిపోయేవారు బంధువులన్న కారణాన విచారపడుతూ యుద్ధాన్ని మానుకొనదలచిన అర్జునికి యుద్ధం చేయడమే స్వధర్మమని భగవద్గీత ఉపదేశించింది. ఇచ్చట ప్రసక్తి ధర్మానికిగాని హింసకు కాదు. గాంధీజీ కూడ ధర్మాను

సారంగా ప్రవర్తించ దలచినవాడు. అందుచేతనే భగవద్గీత ఆయనకు అభిమాన గ్రంథం అయింది.

**58.** డార్విన్ సిద్ధాంతం ప్రకారం కోతులనుండి మానవులు వుద్భవించారుకదా! మరి ఇప్పుడు కోతులనుండి మానవులు ఎందుకు వుద్భవించడము లేదు? అందుకు సైంటిస్టులు ఎందుకు ప్రయత్నించడము లేదు? ఇది నిజమేనా?

కోతుల నుండి ప్రత్యక్షంగా మానవుడు ఉద్భవించినట్లు డార్విన్ సిద్ధాంతం చెప్పడంలేదు. సృష్టిక్రమంలో కోతుల తర్వాత మానవుడు ఉద్భవించినట్లు అది చెప్తూ ఉన్నది. కోతులలో ఉండే కొన్ని లక్షణాలు కాలక్రమేణా అదృశ్యం కావడం, దానితోపాటు మరి కొన్ని లక్షణాలు ఉద్భవించడం — ఈ రెండిటి మూలంగా మానవజాతి ఏర్పడ్డది అని ఈ సిద్ధాంతం చెప్తూ ఉన్నది. ఈ ఏర్పడటం పూర్తి కావడానికి ఎన్ని యుగాలో పట్టింది, ఇట్టి మార్పు ఇకమీదట కూడా జరగవచ్చు కాని దాని ఫలితం, దాని క్రమం కంటికి కనపడేది కాదు. ఇది యుగాలమీదుగా జరిగేది. అందుచేతనే సైంటిస్టులు ఇట్టి ప్రయత్నంలోకి దిగలేదు. అయితే వారు ఎన్నటికికూడా దిగరని చెప్పడానికి వీలులేదు. అంట్లనుకట్టి నూతన ఫలవృక్షాలను వారు నిర్మిస్తున్నారు, గదా! Cross Breedinq ద్వారా జంతుల లక్షణాలను మారుస్తున్నారుగదా! Monkeyqlands ద్వారా మానవునిలో కొన్నిమార్పులు చేయడానికి వారు

ప్రయత్నించడంలేదా ? మానవకోటినంతా నిర్మూలం చేయగలిగే హైడ్రోజన్ బాంబులను నిర్మాణము చేయగల శక్తిని సంపాదించే సైంటిస్టులు విపరీత విజ్ఞానం కోతులనుండి మానవులను సృష్టించే ప్రయత్నంలోకి ఇంకా దిగలేదు. కాని ఎప్పటికీ దిగరని చెప్పుటకు వీలులేదు.

59. సాధారణముగా క్రైస్తవులు మాంసాహారు లయితే క్రీస్తుమాత్రం అహింసామూర్తి ఏమిటి ?

ఒక మానవుడు మరియొక మానవుని హింసించరాదను మహాశ్రేష్ఠమే ఏసుక్రీస్తు ఉపదేశము. మాంసాహారము అహింసకు కూడదని వారు ఎక్కడా ఉపదేశించినట్లు లేదు. క్రైస్తవులలో కూడా శాకాహారులు లేకపోలేదు.

60 ప్రపంచమందు అన్నిమతములకంటె క్రైస్తవమతము ప్రపంచము నన్నిమూలల శ్రేష్ఠ తన్నుతాను పాదుకొనిపో. దానికి గల కారణాలు ఏవో తెలుపవలెను వంటివో చెప్పవలయునని ప్రార్థించుచున్నాను.

క్రైస్తవమతము స్వీకరించిన యూరోపియనులు నాలుగైదు వందల సంవత్సరాలుగా ప్రపంచములోని అన్ని మూలలకు — అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలోకి — వెళ్ళుటకు కావలసిన జ్ఞానము, శక్తి, ఉత్సాహము, సాహసము మొదలైన నానా సాధన సామాగ్రి, యుద్ధములు చేయుటకు కావలసిన నిర్మాణశక్తి, ఆయుధములు మొదలైనవి కలిగి

రీతముగ సంపాదించి ఉపయోగించుటయే క్రైస్తవమతము ప్రపంచమందన్ని ప్రాంతములలో వ్యాపించుటకు కారణము. తక్కిన మతములను అనుసరించినవారిలో – హిందువులలో, మహమ్మదీయులలో, బౌద్ధులలో– ఈ గుణములు ఇటీవల కాలములో సడలించిపోవుట దీనికి తోడ్పడెను. యూరోపియన్ల సామ్రాజ్యములు ప్రపంచమంతట వ్యాపించినట్లే వారి మతమగు క్రైస్తవమతము ప్రపంచమంతట వ్యాపించగలిగెను. క్రైస్తవమతము బోధించు సిద్ధాంతములు తక్కిన మతములు బోధించు సిద్ధాంతముల కంటె ఉత్తమము అగుటచేత అది ప్రపంచమంతయు వ్యాపించినదనే వాదము సహేతుకమైనది కాదు.

62 నాస్తికుల వాదమేమిటి?

భగవంతుడనగాని పరలోకంగాని ఒకటి ఉన్నదని విశ్వసించేవారు ఆస్తికులు. అటువంటిదేదీ లేదని వాదించేవారు నాస్తికులు. భగవంతుడున్నాడా, లేడా, అనే ప్రశ్నకు మానవమాత్రుడెవ్వడూ నిర్ణయాత్మకము చెప్పలేడనిన్ని అది మానవశక్తికి మించిన ప్రశ్న అనిన్ని చెప్పేవారు ఎగ్నాస్టిక్కులు. భగవంతుడున్నట్లుగాని లేనట్లుగాని వారు రూఢిగ చెప్పరు. అలాగ చెప్పుట సాధ్యంకాదని వారి వాదం.

# రాజకీయము : సిద్ధాంత చర్చ

63. ఆచార్య వినోబా చెబుతున్న భూదానవాదం గాంధీవాదం లేక సర్వోదయవాదము) కు, ఎం. యన్. రాయ్. చెప్పిన నవ్యమానవ వాదముకు ఏమయినా సంబంధముండంటారా ?

జవాబు : ఏమీా సంబంధములేదు. వారి దృక్పథాలు వేరు. వినోబాది నైతికదృక్పథం, రాయిది రాజకీయ దృక్పథం. సంఘములోని లోపాలను సరిదిద్దుటకు మానవుని నైతిక పరివర్తనమే ప్రధాన సాధనమని వినోబా వాదం. బలప్రయోగం, రాజ్యాధికారం ప్రధానమని రాయి వాదం.

64. చైనా కమ్యూనిస్టులు ప్రజాస్వామ్యాన్ని ప్రత్యేకంగా Peoples Democracy అని పిలువడంలో గల అంతరార్థమేమిటి ?

ఒక శతాబ్దంగా డెమోక్రసీ అనే పరిపాలనా విధానము ప్రపంచములో అత్యధిక జనాన్ని ఆకర్షిస్తూవున్నది. అదే ఆదర్శవిధానమని అనేకులు అభిప్రాయపడుతున్నారు. కమ్యూనిస్టులకు ఈ విధానం నచ్చకపోయినా ప్రజాభిప్రాయాన్ని తమ వైపు త్రిప్పుకొనడానికి తమ విధానంకూడా Democracy అని చెప్పుకొనటం అవసరం అయింది. ప్రజలను మభ్యపెట్టడమే ఈ అంతరార్థం. కమ్యూనిజానికి, డెమాక్రసీకి ఎలాటి సంబంధం లేదు. ఈ రెండు పరస్పర విరుద్ధములైన విధానాలు.

65. భారత కమ్యూనిస్టుపార్టీ, భారత సోషలిస్టుపార్టీ సిద్ధాంతాలలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞానిక స్వేచ్ఛ గల పరిపూర్ణ ప్రజాస్వామ్యానికి ఏది దోహదపడగల దంటారు ?

సోషలిస్టు పార్టీ సిద్ధాంతాలే తోడ్పడగలవు. కమ్యూనిస్టు సిద్ధాంతంలో వ్యక్తికి స్వేచ్ఛలేనేలేదు వర్గాలలోకూడా కార్మిక వర్గంపై నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీ ఒక్క—దానికే స్వేచ్ఛ; స్వామ్యం ప్రజలదికాదు, కమ్యూనిస్టు పక్షందే; కమ్యూనిస్టు విధానం Dictetorship అని ఆ పార్టీ వారే అంగీకరిస్తున్నారు.

66. ప్రజాప్రభుత్వ లక్షణాలేమిటంటి?

(1) వాక్స్వాతంత్ర్య క్రియా స్వాతంత్ర్యాలు; (2) అనేక రాజకీయపక్షాల సహజీవనము; (3) స్వేచ్ఛతోకూడిన యెన్నికలద్వారా ఉత్తమ పరిపాలక వర్గములోని అధికారులను ప్రజలు నియమిత కాలములలో యెన్నుకొనుట; (4) రాజ్యాధికార వికేంద్రీకరణము; (5) నియమబద్ధమైనట్టియు చట్టబద్ధమైనట్టియు రాజ్యాధికారము; (6) నాయకుల గుణదోషములను విమర్శించుటకు ప్రజలకు అవకాశము—; (7) అట్టి అవకాశమును వినియోగించుటకు వారి సంసిద్ధత; (8) సామాన్యప్రజల నుద్ధరించుటయందు ప్రభుత్వమునకు ఆసక్తి; (9) ఒక రాజకీయ, ఆర్థిక, సాంఘికవర్గమునుండి మరియొక వర్గములోనికి మారుటకు పౌరుల కవకాశము; (10) బలప్రయోగముద్వారా కాక, విద్య

ఆర్థిక పురోభివృద్ధులద్వారా రాజ్యాంగాధికారమును చలాయించుట. ఈ పదిలక్షణాలలో ఏది లోపించినా ప్రజాప్రభుత్వం అనే పేరు సార్థకముకాదు. యివి సామాన్య లక్షణాలు.

67. మార్క్సిస్టు ప్రజాస్వామ్యం ద్వారా అధికారం చేపట్టడంలో ఆసలు నమ్మకే లేదంటారా ?

లేనేలేదు. ప్రతిపక్షంలేని నియంతృత్వమే యితని విధానము.

68. కమ్యూనిజం, ఫాసిజం, డెమోక్రాటిక్ సోషలిజంల మధ్య భేదా లేమిటి ?

మొదటి రెండూ నియంతృత్వవిధానాలు; కడపటిది ప్రజాప్రభుత్వ విధానం; మొదటి రెండూ కొందరి శ్రేయస్సునే గోరేవి; కడపటిది రాజ్యములోని అందరి శ్రేయస్సును కోరేది. ప్రజాప్రభుత్వ విధాన లక్షణాలు పైన వివరింపబడి ఉన్నవి.

69. కాంగ్రెస్ వారి 'సోషలిస్టు పాటరన్ ఆఫ్ ది సొసైటీకి, పి. యస్. పి. వారు చెబుతున్న సోషలిస్టు వ్యవస్థానిర్మాణానికి వున్న భేదాలు ఏమిటి ? కాంగ్రెసుద్వారా సోషలిస్టు పాటరన్ ఆఫ్ ది సొసైటీ నిర్మాణం కాగలదని నమ్మకం మీకుందా ?

సోషలిస్టు పాటరన్ అనే మాటను ఈ రెండు రాజకీయ పక్షాలు వాడుతూ ఉన్నారేగాని, దాని స్వరూపం పూర్తిగా వారింతవరకూ వివరించలేదు. సోషలిజం అన్నమాటకు ఎన్నో అర్థాలు వ్యాఖ్యానాలు అనేకులు చేస్తున్నారు. ఈ వివరణ స్పష్టం అయితేనేగాని పై ప్రశ్నకు జవాబు చెప్పడం సాధ్యం

కాదు.

69. కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతమే లోపభూయిష్టమైనదని కొందరూ, నాయకత్వమే లోపమైనదని కొందరూ అంటున్నారు. ఏది నిజమైన దంటారు ?

రెండు లోపాలు ఉన్నవి. కాని, నాయకత్వములో లోపమే యెక్కువగా గమనింపతగ్గది. నాయకులు సమర్థులైనప్పుడు, లోపములతో కూడిన సిద్ధాంతాలను కూడా వారు ఆచరణలో పెట్టగలవారవుతారు.

70. వలసరాజ్యాలను తీవ్రంగా ప్రతిఘటించే నెహ్రూగారు మన టిబెట్టును కబళించి, అస్సాంలోకూడా సగం తనదేనని పటంలో చూపుకొంటున్న చైనాను ఏమీ అనరేం ?

(1) టిబెట్టు మనది కాదు (2) అస్సాంలో సగం తనదేనని చైనా పటంలో చూపించడం ఋజువు కాలేదు. (3) మలయా బ్రిటిషువారి యొక్కయు ట్యూనిస్ ఫ్రెంచివారి యొక్కయు వలస అయినట్లు టిబెట్టు చైనాయొక్క వలసకాదనిన్నీ, అది భారతదేశంలో ఆంధ్రదేశం (రాష్ట్రం) అయినట్లు — చైనాలో ఒక రాష్ట్రం అనిన్నీ నెహ్రూగారి అభిప్రాయం. ఇది వీరి మొదటి అభిప్రాయం కాకపోయినా, చైనావారితో సంప్రతింపులు జరిగిన తర్వాత వారికి కలిగిన అభిప్రాయం. (4) ఒకవేళ టిబెట్టు చైనాయొక్క వలస అనిన్నీ, అది స్వతంత్ర

రాజ్యంగా మారడం వాంఛనీయమనిన్ని నెహ్రూగారు అను కొనినా, ఈ అభిప్రాయానికి అనుగుణంగా ఆచరించడం వాంఛ నీయమూకాదు, సాధ్యమూ కాదు. చైనాతో భారతదేశము యుద్ధానికి దిగితేనేగాని ఇది సాధ్యముకాదు. ఆలాటి యుద్ధము లోకి దిగడానికి మనకు సామర్థ్యముగాని ఇష్టముగాని లేదు. చైనాతో విరోధము పెట్టుకొనడము మనకు ప్రమాదము, దేశాన్ని పరిపాలించే బాధ్యత వహించేవారి దృష్టిలో ఆదర్శ ప్రపంచము అంత ముఖ్యమైనది కాదు. ఏది ఆచరణసాధ్యమో దానినే వారు చేస్తూ ఉంటారు. సిద్ధాంతాలకు విలువ ఉపన్యాస రంగములో మాత్రమే. కార్యరంగములో వాటికి విలువలేదు. ఇది రాజనీతికి లక్షణము.

**71.** పటిష్టమైన ప్రతి పక్షంగా దేశంలో బలపడగలదని, కాంగ్రెసు తర్వాత దేశానికి నాయకత్వం వహించగలదని అనుకొన్న పి.యస్.పి. రెండుగా చీలిపోయింది. 'నిజమైన సోషలిస్టుల' కర్తవ్యం ఏది టి ?

నిజమైన సోషలిజం అంటే ఏమిటో వివరించడం మొదటి కర్తవ్యం. ఏయే అంశాలలో కాంగ్రెసు మతానికి ఇది భిన్న మైనదో కనపరచడం రెండవ కర్తవ్యం. దీనికి అనుగుణమైన కార్యక్రమం — భూసంస్కరణలు, పరిశ్రమలు, పన్నుల విధానం మొదలగు వాటికి సంబంధించిన కార్యక్రమం — నిర్ణయించు కొనడం మూడవది — దీనిని ప్రజలలో ప్రచారం చేయడం

నాల్గవది. ఇదివరకు సోషలిస్టుపార్టీలోని గొప్పలోపం ఏమిటీ అంటే ప్రజలకు నచ్చేటట్లు సిద్ధాంతాలను ప్రచారంచేయక పోవడమే. వారి ఉపన్యాసాలు ప్రముఖులను ఉద్దేశించే చేయబడుతున్నవి.

72. 'ఆవడి' సోషలిజంపై మీ అభిప్రాయం ఏమిటి?

ఇది నిజమైన సోషలిజం కాదు, ఒక మిశ్రితమైన ఆర్థిక విధానం. దాని స్వరూపం ఇంకా బయటపడలేదు.

73. రాష్ట్ర రాజకీయాల అస్థిరతకు, విద్యార్థుల క్రమశిక్షణకు ఏమైన సంబంధం వుందంటారా? ఏ విధంగా?

దేశంలో ఏర్పడ్డ అస్థిరతయొక్క ప్రతిబింబమే విద్యార్థుల క్రమ శిక్షణారాహిత్యానికి కారణం. రాష్ట్ర రాజకీయాల అస్థిరత ఇందులో ఒక భాగం. ఈ అస్థిరత్వంవల్ల విద్యావిధానంలో జరగవలసిన మార్పుల గురించి చక్కగా ఆలోచించడానికి మంత్రులకు వ్యవధిలేకుండా ఉన్నది.

74. Sccialistic Pattern of Society కి మారుగా Communistic Pattern of Society నిర్మాణాన్ని గురించి కూడా నెహ్రూగారి ఆలోచనకు తగలకపోగలదంటారా? అలా అయినపక్షంలో ఈలాంటి రోల్డుగోల్డుగిల్టు బంగారము ప్రజలలో ఒకసారికి మించి అమ్ముడు పోగలదంటారా?

గిల్టుబంగారము యెప్పుడూ అమ్ముడుపోతూనే ఉంటుంది. ప్రజలలో దానిని కొనేవారు యెక్కువమంది. స్వచ్ఛమైన బంగారాన్ని కొనేవారే తక్కువ.

75. వామపక్షీయులు, పంచమాంగదళం — అను పదముల ప్రయోగము మొదటి సారిగా ఏ విధగా జరిగిందో సవిస్తరంగా తెలియపర్ప గోరుతాను.

వామపక్షీయులు అనే పదము ఫ్రెంచి విప్లవకాలంలో 1789న మొట్టమొదట ప్రచారంలోకి వచ్చింది. విప్లవకాల ప్రారంభములో సమావేశమైన జాతీయ సభలో అధ్యక్షుని యెడమ వైపునసే కూర్చుండిన వారికి వామపక్షీయులనే పేరు వచ్చింది. వీరు పూర్వాచారములను తిరస్కరించి, సంఘాభివృద్ధికి కావలసిన మార్పు లనేకములను ప్రతిపాదించినవారు. ఆ కారణముచేత అప్పటినుండి విపరీతములైన మార్పులను తేగోరు పక్షముల వారికి వామపక్షీయులను పేరు రూఢి అయ్యెను. పంచమాంగదళమనే పదము 1936-39మధ్యన స్పెయిన్‌లో జరిగిన అంతర్యుద్ధ కాలమందు మొదటిసారి ప్రచారములోనికి వచ్చింది. చట్టసమ్మతమైన ప్రభుత్వముపై తిరుగుబాటుచేసి, జాతీయపక్ష నాయకుడైన ఫ్రాంకో, రాజధానియైన మాడ్రిడ్ నగరమును నాలుగు సైనిక దళములతో ముట్టడివేసెను. నగరములోపల ఇతని పక్షమునకు చెందినవారు ఇతని ముట్టడి జయప్రదమగుటకై రహస్యముగ ప్రభుత్వముపై అల్లరుల లేవదీయుచు, ప్రభుత్వపు గుట్టులను గూఢచారుల ద్వారా అతనికి తెలియ జేయుచు, ఇతరవిధములుగా అతనికి

సహాయకడి ప్రభుత్వ సహాయములో ప్రధానపాత్రను వహించిరి. వీరికి పంచమదళమన్న పేరు వచ్చెను. ఆది మొదలు చట్టసమ్మతమైన ప్రభుత్వమును తొలగద్రోయుటకు ప్రయత్నించు బాహ్య శత్రువులకు రహస్యముగ సహాయముచేయు పౌరులకు పంచమదళమన్న పేరు ప్రచారములోనికి వచ్చెను. పంచమదళము వారందరు దేశద్రోహులు.

76. "మార్షల్ లా" అంటే ఏమిటి? భద్రతాసమితిలో అధికార భాషలు ఎన్ని? అవి ఏవి?

దేశంలో ఒక్కొక్కప్పుడు అసాధారణ పరిస్థితులు ఏర్పడతవి. ప్రజలలో కొందరు ప్రభుత్వంపై తిరుగుబాటు చేయడం దానిని అణచడానికి పోలీసు సిబ్బందికి సాధ్యంకాక సైనిక (military) సహాయం అవసరం అవుతుంది. పరిస్థితులు మరీ విషమించినప్పుడు సైన్యాధికారులు నిరంకుశులై ప్రవర్తిస్తేనేగాని శాంతిస్థాపన జరగదు. అలాటి సందర్భంలో వారు వహించే నిరంకుశాధికారానికే మార్షల్‌లా అనిపేరు. ఇష్టం వచ్చినవారిని వారు అరెస్టు చేయడం, బంధించడం, శిరచ్ఛేదం చేయడం, ఆస్తులను వశపరచుకొనడం— ఈలాంటి సర్వాధికారాలను వారు చెలాయిస్తారు. శాంతి కాలంలో అధికారులు లోబడవలసిన చట్టాలేవి వారికి అడ్డవు. అలాంటి సైనికాధికారుల నిరంకుశత్వమే "మార్షల్ లా".

ఇంగ్లీషు, ఫ్రెంచి రషియన్, స్పానిష్, చైనీసు భాషలు.

77. భూ సమస్య పరిష్కారానికి భూదానోద్యమం ఎంతవరకు తోడ్పడుతుంది?

భూములు లేనివారికి భూములు లభించడం ఏలాగు అనేదికదా ఈ సమస్య. భూములున్నవారు, కొంత భాగాన్ని దానంచేస్తే ఈ సమస్య పరిష్కారం అవుతుందనడమే భూదానోద్యంయొక్క ఉద్దేశం. కాని ఈలాటి దానం మూలంగా ఇది పరిష్కారం కాదు. ఐచ్ఛికంగా దానంచేసేవారి సంఖ్య చాలా తక్కువ. దేశంలో దారిద్ర్యం నిర్మూలం కావడానికి ధర్మాత్ములైన దాతలుచేసే దానాలు విస్తారం ఉపయోగించలేదన్న కారణంచేతనే గదా ప్రభుత్వంవారు నిర్బంధంగా, శాసనాల మూలంగా, ధనికులపై పన్నులువేసి, పన్నులద్వారా వచ్చిన ఆదాయాన్ని దారిద్ర్య నిర్మూలానికి వినియోగిస్తూ ఉండడం. అదే విధంగా భూసమస్య పూర్తి పరిష్కారానికి ప్రభుత్వం జోక్యం అత్యవసరం. ప్రభుత్వ బలప్రయోగంద్వారా చట్టాలు సాధించినప్పుడే ఇష్టంఉన్నా లేకపోయినా భూస్వాములు వారి వశము లో ఉండే భూములలో కొంత భాగాన్ని వదలుకోనడం, భూమిలేని వారిలో కొందరికి భూములు లభించడం జరుగుతుంది.

78 సామ్యవాదమంటె ఏమిటి ? లాభాలతోపాటు నష్టాలను గూడా వివరించ గోరుతాను.

సామ్యవాదం అంటే ఒకటి రెండు వాక్యాలలో చెప్పడానికి వీలులేదు. దానికి రెండువందలకంటె ఎక్కువ నిర్వచనాలు ఉన్నవి. ఆ వాదం ప్రతి పాదించేది ఏమిటి అంటే: (1) దేశంలో ఉత్పత్తి అయ్యే పదార్థములు కొందరి అవసరాలు మాత్రమే తీరేటట్లుగాక అందరి అవసరాలు తీరేటట్లు పంపకం జరగవలెను- ప్రస్తుతం అట్లు జరగడంలేదు. ఎక్కువభాగం ధనికుల వంతుకు వెళ్ళుతున్నది. అందరి అవసరాలు తీరేటట్లు పంపకం జరిగితే దారిద్ర్యం నిర్మూలం అవుతుంది. ధనికులుగా ఉండేవారు దరిద్రులుగా ఉండేవారిచేత చాకిరీ చేయించుకొనే దాస్యపద్ధతి అడుగంటుతుంది. (2) ఇట్టి పంపకం జరగడానికి దేశంలో వస్తుసముదాయాన్ని ఉత్పత్తి చేసే సంస్థలన్నీ -- కర్మాగారాలు, రవాణా సాధనాలు. బ్యాంకీలు మొదలైన పరపతి సంస్థలు, వ్యవసాయం మొదలైనవన్నీ వ్యక్తుల యాజమాన్యాన కాకుండా, ప్రభుత్వం యాజమాన్యాన పనిచేయవలెను. కొన్ని వ్యక్తుల యాజమాన్యాన నడుస్తూ ఉన్నా అవి ప్రభుత్వం వారి చట్టాలకు లోబడి పనిచేయవలెను సామ్యవాదాని కంతా ఈ రెండు సూత్రాలు ప్రధానములయినవి. మొదటి సూత్రములో సూచింపబడ్డ ఉద్దేశం అందరూ అంగీకరించ దగ్గదే. మనం కోరవలసింది అందరిసౌభాగ్యంకాని,

కొందరిది మాత్రమే కాకూడదు. రెండవ సూత్రం మాత్రం అందరూ అంగీకరించడంలేదు. ప్రభుత్వ యాజమాన్యాన నడప బడే పరిశ్రమలు కర్మాగారాలు సమర్థతతోను నిజాయితీతోను నడపబడగలవాఅన్న విషయమై కొందరికిసందేహం ఉన్నది. ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం, పనులయందు అశ్రద్ధయెక్కువగాఉంటుందని వీరి భయం. ఈభయానికి ఆధారం ఉన్నప్పుడు, సామ్యవిధానం నష్టదాయకం అవుతుంది. దీనికి ఇంకొక ఆక్షేపణ ఏమిటీ అంటే—ఈ విధానంలో ధనికుల అధికారం పెత్తనం తగ్గినా, ఉద్యోగస్థుల అధికారం పెత్తనం విపరీతంగా పెరిగిపోతుంది. నిజమైన ప్రజాస్వామ్యం ఉంటే దేశాలలో ఈనాటి నష్టం తక్కువ. సామ్యవాదాన్ని ప్రజాస్వామ్యంతో జోడించినప్పుడు నష్టాలకంటె లాభాలే ఎక్కువ అని చెప్పవచ్చు.

**79.** రైతును దేశానికి వెన్నెముకగా గుర్తించినట్లు మన ప్రభుత్వం 'గుమాస్తాను' ఎరిపాలనా వ్యవస్థను వెన్నెముకగా గుర్తించదు ఎందుచేత ?

రైతును వెన్నెముకగా గుర్తించనేలేదు. రైతుకు లభించే ఆదాయం కంటె ఎన్నో రెట్లు ఎక్కువ ఆదాయం కంటె ఎన్నో రెట్లు ఎక్కువ ఆదాయం ఇతర వర్గాలవారు సంపాదిస్తున్నారుగదా ! గుమాస్తా 'వెన్నెముక'— ఏలాగు కాగలదు ? అతనికంటె యెక్కువ బాధ్యత వహించేవారు ప్రభుత్వ కార్యాలయాలలో వున్నారుగదా ? అతడు సాధారణ ఎముక. వెన్నెముక కాదు.

**80.** మంత్రులకు, ముఖ్య మంత్రులకు లేని వయోపరిమితి కేవలం ఉపాధ్యాయులకు, ఉద్యోగస్థులకు మాత్రమే వర్తింపజేయడం ఏమిటి? వృద్ధాప్యంలోని మంత్రులకు మతి స్థిమితం తక్కువ కాదా ?

అందరికీ వయోపరిమితి సూత్రం వర్తించవలసిందే. ప్రస్తుత విధానం చాలా అన్యాయం.

**81.** భారతదేశం అంతర్జాతీయరంగంలో పంచశీలతో పొందిన ఖ్యాతియొక్క ప్రభావం 'గోవా' సమస్యపై ఏవిధంగా ప్రసరిస్తుంది ?

పంచశీలలో (1) దురాక్రమణ తలపెట్టక పోవడం (Non-agression); (2) శాంతియుతసహ జీవనం (coexistance) ఈ రెండు ధర్మాలు చేరియున్నవి. వాటి ప్రభావం ప్రసరించడం వల్లనే గోవా సమస్య సమస్యగానే ఉండడం; మనం దానిని ఆక్రమించి వశం చేసుకొనక పోవడం.

**82.** అధికార వికేంద్రీకరణ సోషలిస్టు వ్యవస్థకు ముఖ్య చిహ్నం కదా ? సోషలిస్టు సమాజం వైపు అంగలు వేస్తున్నామనే మన ప్రభుత్వం యిది ఎంతవరకు చేస్తోంది ?

ఇది ముఖ్యచిహ్నంకాదు. దీనికంటే ముఖ్యములైన చిహ్నాలు చాలా ఉన్నాయి. గ్రామాలలో పంచాయితీలు స్థాపించి, జిల్లాలలో సలహా సంఘాలు స్థాపించి, రాష్ట్ర ప్రభుత్వాల మూలంగా పంచవర్ష ప్రణాళికలో ప్రాజెక్టులను యితర నిర్మాణ కార్యములను సాగించి, మన ప్రభుత్వంకూడా వికేంద్రీకరణకు తోడ్పడుతున్నది.

88. వీటో ప్రయోగమనగేమి ? ఈ హక్కు ప్రత్యేకించి కొన్ని రాజ్యాలకే ఎందుకు ఉండాలి ?

వీటో అనగా అడ్డు తగులుట. ఈ అడ్డుతగిలే హక్కు ప్రపంచంలో అగ్రరాజ్యాలని పేరుగాంచిన ఇంగ్లండు, ఫ్రాన్సు, చైనా, రష్యా, అమెరికాలకు భద్రతాసంఘ వ్యవహారాలలో ఉన్నది. ఈ రాజ్యాలలో ఏది అడ్డుతగిలినా, ఆ సంఘంలో ఏ తీర్మానం చేయడానికి వీలులేదు. ఎక్కువ ఆస్తి ఆదాయము కలవాడు తక్కిన వారికి అడ్డు తగులుతు టారు. రష్యా, అమెరికా మొదలైన అగ్రరాజ్యాల వశంలో ఎక్కువ బల ప్రయోగసాధనాలు—సైన్యాలు, నౌకలు, విమానాలు, ఫిరంగులు, బాంబులు—ఉండడంచేత వారికి ఈ హక్కు లభించింది. ఇది ధర్మంకాదు. కాని వాస్తవ ప్రపంచంలో బలానికే ప్రాధాన్యం.

89. ఆర్థికమాంద్యం ఎటువంటి పరిస్థితులలో ఏర్పడుతుంది ?

ఉత్పత్తి అయిన వస్తుసామగ్రి విపరీతంగా పెరిగిపోవడం, వాటికి గిరాకీ తగ్గడం, వాటి ధరలు పడిపోవడం, ఆకారణాన లాభాలు తగ్గడం—ఈలాటి పరిస్థితులలో ఆర్థిక మాంద్యం ఏర్పడుతుంది. పెట్టుబడిదార్లు నిరుత్సాహులై వ్యాపారంలో దిగడానికి వెనుదీయడంకూడా జరుగుతుంది.

85 సిద్ధాంత వైరుధ్యం, విభిన్న దృక్పథం, వ్యత్యాసంగల కార్యాచరణ తీరులేకనే కేవలం వ్యక్తిగత ప్రాబల్యం కోసం పెనుగులాడి, సదరు సతమతం విఫలం కాగా రాజకీయ రంగంలో అతిహీనమైన వ్యక్తిగత ద్వేషం ఆచరించి, తత్ఫలితంగా రూపొందిన లోహియా ముఠా (సోషలిస్టుపార్టీ) యొక్క మనుగడ దేశానికి ప్రయోజనకరమైనదేనా ? ఈ ముఠా పట్ల మీ అభిప్రాయమేమి ?

ఇట్టి ముఠాలు ప్రస్తుత పరిస్థితులలో తప్పవు ప్రజాస్వామ్యం మనదేశానికి క్రొత్త సంధికాలంలో ఈలాటివి ఒకరోజు పుట్టడం, మరునటి రోజు గిట్టడం జరుగుతుంది. వాటిని గురించి ఆందోళపడడం, ఉద్రేకాన్ని పొందడం అవివేకం.

86 వినోబాజీగారి భూదానోద్యమం ప్రజలకు దారిద్ర్యాన్ని పంచడము తప్పితే వేరే వుద్దేశ్యము లేదని హరేకృష్ణ మెహతాబ్ గట్టిగా చెప్పినారు. మెహతాబ్ గారికి ఏమి సమాధానం ఇవ్వాలి అంటారు ?

(ఎ) చెప్పడానికి తగిన సమాధానం గొప్పది ఏమీ లేదు. ఎందుకంటే జమీందారీలరద్దు జరిగిన తర్వాత మన దేశంలో గొప్ప భూస్వాములని చెప్పుకోతగ్గవారిసంఖ్య చాలా తక్కువగా ఉంది. రైతులలో అధిక సంఖ్యాకులు ఒకటి రెండు ఎకరాల ఆస్తిని అనుభవించేవారు. దానంచేసే స్థితిలో ఉంటే వారి సంఖ్య చాలా తక్కువగా ఉన్నప్పుడున్నూ, ఆలాటి వారిలో దానం చేయడానికి ఇష్టపడేవారి సంఖ్య మరీ తక్కువగా ఉన్నప్పుడున్నూ, దానంచేసేవారుకూడా వెంటనే వ్యవ

సాయం చేయడానికి యోగ్యంగాని పత్రలను బీళ్ళను దానం చేస్తూ ఉన్నప్పుడున్నూ, భూదానోద్యమంవల్ల ఎందరిదారిద్ర్యం తొలగి పోగలదు అనేభావనతో మహాత్ముడు ఆ విధంగా అభిప్రాయపడ్డారు.

(బి) ప్రభుత్వంవారి అధీనంలో ఉన్న భూములను ఏదో ఒక క్రమపద్ధతిని పంచిపెట్టడం జరిగితే, భూదానఉద్యమం వల్ల కలిగే ఫలితాలకంటె ఎక్కువ ఫలితాలు కలుగగలవు ఈ విషయాన్ని వినోబాభావేగారు గుర్తించడంలేదు. ఏమిటి వారి ఉద్దేశ్యం? భూములు లేనివారికి భూములు లభించడమా? లేక భూములున్నవారిలో దానగుణం వృద్ధికావడమా? వారు మొదటిదానికంటే రెండవదానికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. యీ రెండూ అవసరమే కాని దేశానికి ఎక్కువ అవసరం అన్న విషయంలో అభిప్రాయభేదం కలుగుతున్నది.

(సి) ఇంకొకటి ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో భూదానానికి ప్రాముఖ్యం ఉన్నదా అన్న విషయాన్ని గురించికూడ దేశంలో ఉండే ప్రముఖులు చక్కగా ఆలోచించడంలేదు. ప్రపంచంలో ఆదాయం సంపాదించడానికి వ్యవసాయమే ప్రధాన సాధనంగా ఉన్న రోజులలో భూమిని సంపాదించడం ప్రతివ్యక్తికి అవసరంగా ఉండేది. కాని ప్రస్తుతయుగం పారిశ్రామిక యుగం, భూమి లేకపోయినా, ఆదాయం సంపాదించడానికి సాధనాంత

రాలు చాలా ఉన్నాయి. మనిషికి కావలసింది ఆదాయాన్ని ఇయ్యగల వృత్తి. స్వల్పఆదాయం ఇయ్యగల ఎకరా భూమి కాదు. జనసామాన్యం కోరవలసింది ఆదాయకరములైన వృత్తులుగాని భూమికాదు. ఈ యుగములో భూమిపైన ఉండే వ్యామోహం సందర్భరహితం. ఇది 19 వ శతాబ్దపు నినాదం. భూసంస్కరణ గురించి సిద్ధాంతాలన్నిటినీ పునర్విమర్శన చేసుకొనడం అవసరం. ఈ విషయాలన్నిటినీ గమనిస్తే మెహతాబ్ గారి అభిప్రాయంలో సత్యం ఉన్నదని చెప్పవలసివస్తుంది. ప్రస్తుత ఆర్థిక రాజకీయ పరిస్థితులలోను, పన్నుల భారం పెరిగి పోతున్న ఈ కాలంలోను ఆస్తులన్నిటిలో స్థిరాస్తికి (భూమిపై ఆస్తికి) అగ్రస్థానం ఇవ్వడం విచక్షణతో కూడుకొన్నదా ?

**87.** స్వాతంత్ర్యం సిద్ధించి ఎనిమిదేళ్లు అయింది కదా ? అప్పటినుంచి భారతచరిత్రలో గుర్తించతగ్గ విశేషాలు ఏమైనా వున్నాయా ?

ఉన్నవి. (1) సంస్థానాల విలీకరణద్వారా దేశమంతటిపైన ఒకే కేంద్రప్రభుత్వం ఏర్పడడం; (2) దేశాన్ని పాలించడానికి ప్రజాస్వామ్య సిద్ధాంతాల ననుసరించి ఒక రాజ్యాంగం నిర్మాణము కావడం; (3) ఆర్థికంగా ఆహారపదార్థాల ఉత్పత్తిలో స్వయం సంపూర్ణత సంపాదించడం; (4) మొదటి పంచవర్ష ప్రణాళికలో సూచింపబడ్డ ప్రాజెక్టులు, పరిశ్రమలు, రవాణాసౌకర్యాలు, సాంఘిక సంక్షేమ కార్యకలాపాలు నిర్మా

ణం కావడం; (5) అంతర్జాతీయ రంగంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించడం—ఇవి ముఖ్యంగా గమనించతగ్గవి. చేయవలసిన పనులకున్నూ చేసినవాటికిన్నీ అంతరాళం ఎక్కువగా ఉండడంచేత విశేషాలు ఏమీ లేవనే భావం అనేకులలో వ్యాపించి ఉంది. కాని అది సరియైన భావంకాదు.

88 చాణక్యుని అర్థశాస్త్రమునకు యిప్పటి అర్థశాస్త్రమునకు భేదమేమి ?

చాణక్యునిది పేరునకు అర్థశాస్త్రమే గాని, నిజముగా అది రాజనీతిశాస్త్రం. రాజులు రాజ్యాన్ని ఏలాగు పరిపాలించవలెనో వివరించడమే దాని ప్రధానోద్దేశ్యం. యిప్పటి అర్థశాస్త్రం, దేశంలోని ప్రజల ఆదాయాన్ని నిర్ణయించే సంగతి సందర్భాలను వివరిస్తుంది.

89 వ్యక్తి స్వాతంత్ర్యమునకు పరిమితి ఏమి ?

ఇతరుల స్వాతంత్ర్యానికి సౌఖ్యానికి ప్రత్యక్షంగా భంగం కలిగించనంతవరకు ప్రతివ్యక్తికి స్వాతంత్ర్యం వుండవచ్చు. అంతకు మించి స్వాతంత్ర్యం వుండరాదు.

90. భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలని ఇన్నాళ్ళుగా ఆందోళన చేయుచున్న ప్రజలకు నాయకులనుండి కొత్తగా దిగుమతి యయిన బహుభాషారాష్ట్ర ప్రతిపాదన పట్ల ప్రజాహృదయం ఎలా ఉంటుంది ? ఈ ప్రతిపాదన పట్ల మీ అభిప్రాయం ఏమిటి ?

ఈ ప్రతిపాదనపట్ల ప్రజాహృదయం సుముఖంగా వుండదు. నాయకుల యెడల ప్రజలకుగల విశ్వాసంకూడా దీని

మూలంగా తగ్గుతుంది. ఇది ప్రస్తుత పరిస్థితులలో ఆచరణీయమైన ప్రతిపాదనకాదు. దీని మూలంగా దేశంలో విపరీత పరిస్థితులు ఏర్పడవచ్చు. రాష్ట్రాలను భాషాప్రయుక్తాలుగా విభజించి, అవి ఎలాగు పరిపాలింపబడునో కొన్ని సంవత్సరాలపాటు గమనించి, అటు తర్వాత ఈ 'దిగుమతి'ని గురించి ఆలోచించడం మంచిది

91. ద్విభాషారాష్ట్రాలను రూపొందించే టప్పుడు మన విశాలాంధ్ర కర్ణాటక మహారాష్ట్రాలలో వేటితో కలిసియుండుట ఉచితమంటారు ?

కర్ణాటకంతో కలియడమే ఉచితం. మన సంస్కృతికి వారి సంస్కృతికి యెక్కువ సంబంధం ఉంది. ఆంధ్ర సామ్రాజ్యాలలో ఆఖరుది అయిన విజయనగర సామ్రాజ్యం చాల వరకు ఆంధ్రకర్ణాటక మండలాల సంయోగంవల్ల ఏర్పడ్డది.

92. పంచశీల అనగా నేమి ? దాని అయిదు సూత్రాలు ఏమిటి ?

రాజ్యాలు రాజ్యాలుమధ్య శాంతి, స్నేహం సమకూరడానికి, యుద్ధాలు రాకుండా ఉండడానికి అనుసరించతగ్గ సూత్రాలకు పండిత నెహ్రూ పంచశీల అనే పేరు పెట్టారు. ఈఅయిదింటిని మొట్టమొదట టిబెట్ గురించి రెండు సంవత్సరాల క్రిందట చైనా భారత దేశాలమధ్యన జరిగిన ఒడంబడికలో వుదాహరించారు. అప్పటి ంచి, అని ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి. ఆ సూత్రాలు.

(1) రాజ్యాలమధ్య పరస్పర గౌరవభావము—Mutual Respect for each others' territory; (2) దురాక్రమణ వాంఛారాహిత్యము— Non - aggression : (3) అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనక ఉండడం—Non - interference in each other's internal affairs : (4) సమత్వము; పరస్పర సహకారము. Eguality and mutual benefit (5) శాంతియుతిసహజీవనం peaceful Co-existenee.

ఈ సూత్రాలను రాజ్యాలన్నీ అనుసరిస్తే యుద్ధమనేదే యుండదు. కాని అలాటి సంసిద్ధత వున్నదా అనేదే ప్రశ్న. ప్రపంచంలో అవినీతికి నీతిసూత్రాలు లేకపోవడం కారణంకాదు. వాటిని ఆచరణలో ఉంచుటకు కావలసిన పరిస్థితులలోపమే ఆ కారణం. అందరూ పతివ్రతలైతే వ్యభిచారం ఉండదు. అందరూ శాంతిమార్గాన్ని అనుసరిస్తే యుద్ధం ఉండదు. కాని ఇది జరగడం ఎలాగు ?

93. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగ నిర్మూలనం జరుగుతుందంటారా ?

నిర్మూలనం జరుగదు. కాని నిరుద్యోగం కొంతవరకు తగ్గవచ్చు. ఏటేటా పెరుగుతున్న జనసంఖ్యలో సుమారు 18 లక్షల జనానికి క్రొత్తగా ఉద్యోగాలు కల్పించవలసి వుంటుంది. అంటే 5 సంవత్సరాలలో 90 లక్షలజనం యీలాటి స్థితిలో

వుంటారు. వీరితోపాటు ప్రస్తుతం నిరుద్యోగులుగా వుండేవారున్నారు. అంటే సుమారు కోటి జనానికి ఉద్యోగాలు కల్పించవలసిన అవసరంవుంది. అందుకుగాను కుటీరపరిశ్రమలు చిన్నరక (Small scale) పరిశ్రమలు స్థాపించడం జరుగుతుంది. భారీ పరిశ్రమల పోటీ వీటికి తగలకుండా వుండడానికి కొన్ని ఏర్పాటులు తలబెట్టివున్నారు. ఇదంతా ఎంతవరకు కొనసాగ కలదో గట్టిగా చెప్పతగ్గవారెవ్వరులేరు. అనుకొన్న అంచనాలు క్రియారూపం ధరిస్తే నిరుద్యోగం కొంతవరకు నిర్మూలం అవుతుంది.

కొన్ని దేశాలలో సైన్యాలను విపరీతంగా పెంచి నిరుద్యోగాన్ని నిర్మూలం చేశారు. ఇది మన రాజనీతికి విరుద్ధం. అనేక దేశాలలో సంతాన నిరోధంమూలంగా జననం ఖ్యాని పరిమితం చేసుకొని నిరుద్యోగాన్ని తగ్గించుకొన్నారు. ఇది మన సాంప్రదాయానికి విరుద్ధం.

**94.** మొన్నటి ఎన్నికలలో కమ్యూనిస్టులు పరాజయము పొందుటకు కారణమేమి ?

మూడు ముఖ్యకారణాలు– (1) కాంగ్రెసు, కె. యల్. పి. ప్రజాపార్టీలు మూడూ కలిసిపోవడం, ఇది ప్రధాన కారణం. (2) రేషనింగు రద్దుకావడం, ఆహార సమస్య చాలావరకు పరిష్కారం కావడం. (3) కమ్యూనిస్టులు వాగ్దానాలు చేసేవారే

గాని, వాగ్దానాలు అమలులో పెట్టుటకు అవకాశం లేనివారనే అభిప్రాయం ప్రజలలో వ్యాపించడం.

౫౮. శ్రేయోరాజ్యము; ప్రగతి అంటే యేమిటి ?

శత్రువుల బాధనుండి ప్రజలను రక్షించే పనిని మాత్రమే గాక, ప్రజల శ్రేయస్సు—సుఖంగా జీవించడం—వృద్ధి కావడానికి కావలసిన పనులనుకూడా చేసే ప్రభుత్వం ఉన్నప్పుడు రాజ్యాన్ని శ్రేయోరాజ్యం అని అంటాము. ప్రజల కనీస అవసరాలను తీరుస్తూ, విద్య, ఆరోగ్యం, మొదలైన వాటిని చక్కబెడుతూ, నిరుద్యోగులకు ఉద్యోగాలను కల్పిస్తూ, స్వయంగా పోషించుకోలేని వృద్ధులు మొదలైన వారిని పోషిస్తూ పరిపాలించే రాజ్యం శ్రేయోరాజ్యం.

ప్రగతి అంటె ముందుకు వెళ్ళడం. అభివృద్ధి అన్న మాట—పురోగమనం అన్నదానికి పర్యాయపదం. ప్రజల సిరి సంపదలు వృద్ధి కావడం, వారి జీవితం అన్నిరంగాలలో వికాసవంతం కావడం—దీనికి లక్షణం.

౫౯ పాకిస్తాన్ భారత భూభాగ దురాక్రమణ చేయగలదని భారత ప్రజలు భావించడం అవసరమేనంటారా ?

అవసరమే. (1) మన దేశంపట్ల పాకిస్తాన్‌కు పరమ ద్వేషం. (2) చిన్నదేశాలు పెద్ద దేశాలపై దురాక్రమణ

చేయడం అప్పుడప్పుడూ జరుగుతూ ఉండేదే. జాగరూకతలేని పెద్దరాజ్యాలను పడగొట్టి ప్రపంచచరిత్రలో చిన్నరాజ్యాలనే కాలు గొప్పరాజ్యాలు కావడం జరిగింది. (3) మనది అహింసా విధానం అని, యుద్ధంచేసేవారం కామని పాకిస్తాన్‌వారి భ్రమ. (4) వీటి అన్నిటికంటె బలవత్తరమైన కారణం ఏమిటీ అంటే, పాకిస్తాన్‌లో ప్రస్తుతం వుండే ప్రభుత్వం సాంఘిక ఆర్థిక ప్రణాళిక లమూలాన ప్రజాభిమానాన్ని సంపాదించలేకుండుట. సాధారణంగా అట్టి ప్రభుత్వాలు విదేశాలపై దురాక్రమణ చేయుడం మామూలు. ఇప్పటి పాకిస్తాన్ ధోరణి ఇలాటిదే.

**97.** మనిలా బాగ్దాదు కూటములవల్ల సదరు కూటముగానిని సభ్య రాజ్యములకు కలిగే ఫలితాల స్వరూపమేలా వుంటుంది ?

(1) వీటిలోచేరిన థైలాండు, ఫిలిప్పైన్‌ను, పాకిస్తాన్ మొదలైన చిన్నరాజ్యాలకు అమెరికాయొక్క ఆర్థిక సైనిక సహాయం లభిస్తుంది. (2) కాని పెద్దరాజ్యాలైన అమెరికా బ్రిటన్‌లు ఇండియా యొక్కయు, ఈజిప్టు మొదలైన అరబ్ రాజ్యాలయొక్కయు సుహృద్భావాన్ని కోల్పోవడం జరుగుతుంది. (3) ఇది కారణంగా రష్యాయొక్క పలుకుబడి మధ్య ప్రాచ్యంలో యెక్కువ అవుతుంది. మొత్తముమీద సభ్య రాజ్యాలు ఉద్దేశించిన ఫలితాలు లభించుట కష్టసాధ్యం.

**98.** విశాలాంధ్రకు లెజిస్లేటివ్ కౌన్సిల్ అవసరమా ?

అవసరం కానేకాదు. రాష్ట్ర శాసనసభలో రెండు శాఖలు ఉండవలసింది లేదు. రెండు శాఖలుండవలెననే వాదం పాత కాలంనాటిది. రాజకీయ పక్షాల నిరంకుశత్వం ప్రాబల్యం గాంచిన ఈరోజుల్లో అసెంబ్లీలో ఏలాటి సభ్యులుంటారో అలాంటి వారే-అట్టి దృక్పదంకల వారే-కౌన్సిల్లో కూడా సభ్యులవుతారు. భిన్నదృక్పదం వీలుకానప్పుడు కౌన్సిలువల్ల ఎలాటి లాభంలేదు.

**99.** గత 30 సంవత్సరాలుగా ఆరాధించబడిన స్టాలిన్ మరణానంతరం యిన్నాళ్ళకి తీవ్రవిమర్శలకు గురికావడానికి కారణాలు వివరిస్తారా? ఈ విషయంలో సోవియట్ నాయకుల ఆంతర్యం ఏమిటి?

(1) ఇది నియంతృత్వ ప్రభుత్వానికి ప్రధాన లక్షణం. నియంతృత్వ విధానంలో నియంతకు తప్ప తక్కినవారెవరికి వాక్స్వాతంత్ర్యం ఉండదు. నియంత ఎన్ని ఘాతుక కృత్యాలను చేసినా, వానిని మందలించేవారు విమర్శించేవారు అతని జీవిత కాలంలో ఎవరూఉండరు. ఏ విమర్శవచ్చినా మరణానంతరమే. చరిత్రసిద్ధమైన ఈ సత్యం స్టాలిన్ ఎందుకు విమర్శలకు గురి అయ్యాడో స్పష్టం చేస్తున్నది (2) ప్రపంచమంతటా కమ్యూనిజాన్ని వ్యాపించడానికి ప్రచ్ఛన్న యుద్ధం, కోరియాయుద్ధం వంటి చిల్లరయుద్ధాలు, అణ్వస్త్రాల సముపార్జన మొదలైన సాధనాలను స్టాలిన్ ఉపయోగించాడు. కాని దీనిమూలంగా కమ్యూ

నిస్టుపార్టీయొక్క ఆశయం సిద్ధించలేదు. ఆ ఆశయసిద్ధికిసాధనాంత రాలను ఇప్పటి నాయకులు ఉపయోగింపదలచారు. విదేశ రాజ్యాంగ నీతిలో దీనిమూలాన గొప్పవిప్లవరూపకమైన మార్పు వచ్చినది. ఇంతటిమార్పును సమర్థించడానికి స్టాలిన్‌ను ఖండిం చడం అత్యావసరం-ప్రపంచంయొక్క స్వానుభూతిని సంపాదించ డానికి ఇప్పటి నాయకులు పన్నిన పన్నాగం ఇది. (3) కమ్యూ నిస్టు సిద్ధాంతంలో నీతి అనగా అవసరానుకూల్యత. ప్రస్తుతం వారికిప్పుడే అవసరం స్టాలిన్‌ను ఖండించడంవల్ల సిద్ధిస్తుంది. అందుచేత వారికి అదేనీతి.

100. సర్వోదయ సోషలిజాలకుగల వ్యత్యాస మేమంటారు ?

రెంటియొక్క ఆదర్శము మానవు లందరియొక్క శ్రేయస్సే. కాని పుట్టుకలోను, వృద్ధిగాంచిన వాతావరణము లోను రెండు సిద్ధాంతములకు భేదమున్నది. వస్తు సముదాయము నుత్పత్తిచేయు పరిశ్రమలందును వ్యవసాయాదులందును ఆవిరి శక్తి మొదలైన బాహ్యశక్తుల సహాయమున నడుచు భారీ యంత్రముల నుపయోగించుటవలన ఏర్పడ్డ ధనిక దరిద్రవర్గ ఘర్షణ సోషలిజానికి వుత్పత్తిస్థానం. ఆ ఘర్షణను నిర్మూలము చేయుటకై పాశ్చాత్య వాతావరణములో ఆసిద్ధాంతము పెరి గినది. సర్వోదయము భారతీయుల పరిస్థితులలో సాంప్రదాయ సిద్ధమగు నిరాడంబర జీవితమును పునరుద్ధరించుటకు ప్రతిపాదింప

బడిన సిద్ధాంతము. గ్రామ సౌభాగ్యము, కుటీరపరిశ్రమలు, పరిమితములైన ఐహిక వాంఛలు, ఆధ్యాత్మిక జీవితమందు ఆసక్తి—దీనికి లక్షణములు.

**101.** లోహియాగారు ద్రవిడకజగం యొక్క కృషి శ్లాఘిస్తూ బ్రాహ్మణేతర వర్గాలపాల నావశ్యకతను వివరిస్తూ ప్రకటన చేశారుగదా? సోషలిస్టు పార్టీ అధినేతలు అఘోరశ్రేణిలో ఉండటం సమర్థనీయమంటారా?

సమర్థనీయంకానేకాదు. ఎన్నడూకూడా దేశంలో బ్రాహ్మణ పరిపాలన ఉండినదిలేదు. ఎల్లప్పుడు బ్రాహ్మణేతరులే పాలకులుగా ఉంటూ వచ్చారు. ఇప్పుడుకూడా ఆ శ్రేణిలోనే పరిపాలన సాగుతూ ఉంది. నిజమైన సోషలిజాన్ని ప్రచారం చేయ డానికిన్నీ ఆచరణలో పెట్టడానికిన్నీ చేతగాక, లోహియాగారు ఇట్టి అప్రస్తుత విషయాలలో జోక్యంకలిగించుకుంటూ ఉన్నారు. బ్రాహ్మణాధికృతి ప్రస్తుతకాలంలో చచ్చిన పామువంటిది. చచ్చిన పామును కొట్టడానికి ప్రయత్నించేసేవారి తెలివితేటలు గురించి ఏమని చెప్పడం!

**102.** ఆంధ్ర మరియు తెలంగాణా యను నీరెండు శబ్దములు ఎన్ని వందల సంవత్సరముల క్రిందట ఎట్లు వాడుకలోనికి వచ్చెనో చెప్పగలరా?

"ఆంధ్ర" శబ్దము జాతిపరముగ ఐతరేయ బ్రాహ్మణ కాలమునుండి—అనగా 2500 సం॥ నుండి—వాడుకలో ఉన్నది. దేశపరముగ నిది 11 వ శతాబ్దము తర్వాత వాడుకలోనికి వచ్చినట్లు చెప్పవచ్చును. 'తెనుగు' అను పదము భాషాపర

ముగ 11 వ శతాబ్దమునుండి వాడబడినట్లు, దాని రూపాంతరమే 'తెలుగు' అనియు, దానినే 14 వ శతాబ్దమునుండి మహామ్మదీయులు 'తెలుగు' అని వాడుచుండిరనియు, 'తెలుగు' భాషను మాట్లాడువారి దేశమునకు తెలంగాణా అన్న పేరు వారే పెట్టినట్లును తెలియుచున్నది.

103. కాశ్మీరు సమస్యపై పాకిస్థానుకు మనీలామండలి మద్దతు కారణంగా మన వైదేశిక రాజనీతిలో మార్పు అవసరమా? అయితే అది ఎలా వుండాలి?

ఏ మార్పు అవసరం లేదు. మనిలా మండలి పాకిస్థానుకు ఏలాంటి మద్దతు ఇయ్యలేదు. దీనియొక్క ప్రసక్తి ఆ మండలి సభలో వచ్చిందన్న కారణంచేత మనం అలజడిగాని భయాన్నిగాని పొందవలసింది లేదు. ఆ ప్రసక్తి రావడం కొంత లాభకారి అయింది. కాశ్మీరు చట్టరీత్యా ఇండియాలో ఒకభాగం అనిన్నీ, కాశ్మీరు మహారాజు విలీనానికి అంగీకరించకపోయినా ఇది ఇండియాలో ఒకభాగంగా ఉండవలసినదనిన్నీ, పాకిస్తాన్ సైన్యాలు పూర్తిగా కాశ్మీరునుండి తొలగిపోతేనేగాని ప్లెబిసైట్ ప్రసక్తిలేదనిన్నీ మార్చి 29 తేదీన మన ప్రధాని ప్రథమ పర్యాయం సిస్సందేహంగా ఖచ్చితంగాను ఉద్ఘాటించుట దీని ఫలితమే.

104. లోకసభలోగాని, రాజ్యసభలోగాని శాసనసభలలోగాని ఏదైనా బిల్లు ప్రవేశపెట్టబడిన వెంటనే సెలక్టుకమిటీ పరిశీలనకు పంపుతారు.

అలా ఎందుకు పంపాలి. ? ఆ కమిటీ ప్రాముఖ్యత, దానిలోని సభ్యులు మొదలగు వివరాలు తెలియజేస్తారా ?

లోక్ సభ మొదలైన వాటిలో రకరకాల సభ్యులుంటారు. అందరికీ అన్ని బిల్లులలోని గుణదోషాలు తెలియవు. ఒక్కొక్క బిల్లులోని ప్రత్యేక విషయములను విమర్శించుటకు సభ్యులలో అర్హులైనవారిని కొందరిని ఒక సెలెక్టుకమిటీగా ఏర్పాటుచేసి, బిల్లును వారి పరిశీలనకు పంపుతారు, వారు బిల్లును సమగ్రముగ పరిశీలించి, ఒక నివేదికను సభవారికి సమర్పిస్తారు. తక్కిన సభ్యులు బిల్లులోని విషయములను అవగాహన చేసుకొనుటకది ఎంతో తోడ్పడుతుంది.

105. పాకిస్థాను నుండి వస్తున్న కాందిశీక ప్రవాహ సమస్యను పరిష్కరించేందుకు మీ సలహాఏమిటి ?

(ఎ) పాకిస్థాన్‌ను పాలిస్తూండే అధిక సంఖ్యాకులగు మహమ్మదీయులలో హృదయ పరివర్తనం కలగటం ఒక్కటే దీని పరిష్కారానికి సాధనం. హిందువులు కూడా సమాన హక్కు అనుభవించుటకు తగిన పౌరులన్న విషయం వారి మనస్సులలో నాటుకొన్ననాడే ఇది పరిష్కారం అవుతుంది. (బి) ఇది తప్పితే పాకిస్థాన్‌నుండి ఇండియాకు రాదలచిన వారందరికి మనం ఆశ్రయం ఇయ్యడం రెండవసాధనం. దాని మూలంగా ప్రవాహం ఆగిపోతుంది (సి) పాకిస్థాన్‌లోని హిందువులందరు సత్యాగ్రహం చేయడం మూడవ సాధనం (డి) ఏమీ

చేయలేనివారు మహమ్మదీయ మతాన్ని స్వీకరించటం నాల్గవ సాధనం. (ఇ) ఇందుకుగాను పాకిస్థానుతో యుద్ధం చేయడం ఎన్నటికి సాధ్యం కాజాలదు.

**106.** శ్రామికవర్గాల జీవన ప్రమాణాభివృద్ధికి మీరు సూచించే మార్గం ఏమిటి ?

(1) శ్రామికవర్గాల జీవనప్రమాణం వృద్ధికావడం అత్యవసరమన్న భావం ఇతరవర్గాల్లో ఎక్కువగా వ్యాపించడం (2) వ్యవసాయం పరిశ్రమలు మొదలైనవి వృద్ధిగాంచి దేశాదాయం పెరగటం, (3) ప్రభుత్వం ధనికులపై యెక్కువ పన్నులను విధించి, వసూలైన ఆదాయాన్ని శ్రామికవర్గాల శ్రేయస్సుకై వినియోగించటం, (4) దేశాదాయం వృద్ధిఅయితేనేకాని తమ జీవనప్రమాణం వృద్ధికాదనిన్ని, అట్టివృద్ధికి తాము సర్వవిధాలా తోడ్పడడం అవసరమనిన్నీ అనాలోచితంగా సమ్మెలు మొదలైన నష్టకరములయిన ఉద్యమాలను లేవదీయరాదనిన్నీ శ్రామిక వర్గాలు గ్రహించటం. ఈ నాలుగు మార్గాలమూలాన వారి జీవితప్రమాణం అభివృద్ధి పొందుతుంది.

**107.** వస్తువుల ధరల స్థిరీకరణ చెందించడం ఏలాగు ? ఈ సందర్భములో ప్రభుత్వ కర్తవ్యమేమిటి ?

ఏలాంటిమార్పు లేక వస్తువుల ధరలను స్థిరీకరణ చెందించడం వాంఛనీయంకాదు. కొద్దిపాటిగా అవి పెరుగుతూ ఉండడం మంచిది. దేశంలోని చెలామణి (Currency) ని పరిస్థితులను

లనుబట్టి హెచ్చుచేయడం తగ్గించడం మూలాన ప్రభుత్వంవారు ధరలను స్థిరీకరణం చేయగలరు. బ్యాంకిలన్నిటిపై ప్రభుత్వ బ్యాంకీ అయిన రిజర్వు బ్యాంకికి సర్వాధికారం ఉన్న కారణాన ప్రభుత్వంవారు ఈ సాధనాన్ని ఉపయోగించి ధరలను స్థిరీకరణం చేయవచ్చు.

**108.** గ్రామ పంచాయతీ, పురపాలక సంఘాలలో పార్టీలకతీతమైన పరిపాలన జరలగాసే పద్ధతి మంచిదే నంటారా ? దీనివలన ఫలితాలు ప్రయోజనకరమైనవి కలుగగలవంటారా ?

పార్టీలే లేకుండా, ఏకగ్రీవంగా పంచాయతీ సభ్యులను పురపాలక సంఘ సభ్యులను ఎన్నుకోనవలెనని చెప్పడం ప్రమాదకరం. ఎన్నికలు ఉన్నప్పుడు పార్టీలుకూడా ఉండక తప్పవు. ప్రజాపరిపాలనకు పార్టీలు ప్రధానసాధనాలు. కాని, కావలసింది ఏమిటంటే అధికారానికి వచ్చిన తర్వాత, పార్టీవారు సమష్టిలాభాలకుగాను పాటుపడడం, ప్రజలలో రాజకీయ చైతన్యం ఉన్నప్పుడు ఇది జరుగుతుంది. ఏదేశంలోకూడా పార్టీలు లేకుండా ప్రజాపరిపాలన జరగడం సత్యాన్ని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి.

**109**. పాకిస్థాన్‌లోని రాజకీయ అస్థిరతకు కారణ మేమంటారు ?

జిన్నాయొక్క అకాలమరణం, ప్రజలందరి గౌరవాభిమానాలకు పాత్రుడైన నాయకు డింకొకడు లేకపోవడం ప్రధాన కారణం. స్వార్థపరులైన చిల్లర నాయకులందరిని అదుపులో

ఉంచతగ్గవాడు ఎవడూ పాకిస్థాన్‌లో లేడు, మన దేశంలో స్థిరత్వానికి ప్రధానకారణం పండిట్ నెహ్రూ అన్న అంశం ఈ సందర్భంలో మనం మరువకూడదు, ప్రజాస్వామ్యం స్థిరంగా నాటుకోనని ఇండియా, పాకిస్థాన్ వంటి రాజ్యాలలో ఇట్టినాయకులె స్థిరత్వానికి ఆధారం.

110. Constitution అనగా నేమి? Rigid and Flexible constitution కు భేదమేమి?

రాజ్యాన్ని ఏ విధంగా పరిపాలించవలెనో నిర్ణయించే శాసనానికి constitution అని పేరు. దానిని సులభంగా మార్చడానికి వీలున్నప్పుడు Flexible అంటారు; అలాంటి వీలు లేనప్పుడు Rigid అంటారు.

111. ఏదేశ్శంలో ప్రభుత్వాన్ని పట్టుకుంటామనే డా లోహియా గారి ప్రణాళికపై మీ అభిప్రాయం ఏమిటి? ఇందు కవకాశములు వివరించ గోరెదను.

ఇది ఆచరణ సాధ్యమైన ప్రణాళిక కాదు. ప్రజలలో సోషలిస్టులకు ప్రస్తుతం ఏలాంటి పలుబడిలేదు. పండిట్ నెహ్రూ ఉన్నంతకాలం కాంగ్రెసును పడగొట్టి అధికారంలోకి రానడం ఏ పార్టీకి సాధ్యంకాని పని. ఆయన అనంతరం రాజకీయ పరిస్థితులు దేశంలో ఏలాగు ఉండగలవో, క్రమమైన ప్రజాస్వామిక విధానం ఆచరణలో ఉంటుందో వుండదో చెప్పడానికి వీలులేదు.

అస్థిర పరిస్థితులు యేర్పడ్డప్పుడు నిర్మాణబలంగల పార్టీ అధికారంలోకి రావడం జరుగుతుంది. అట్టి బలం లోహియాపార్టీకి లేదు. ఇంతకూ నెహ్రూ అనంతరం బలిష్టమైన కేంద్రప్రభుత్వం ఎంతవరకు వుంటుందో చెప్పడం కూడా సాధ్యంకాదు.

**112.** రెండవ పంచవర్ష ప్రణాళిక ననుసరించి పరిశ్రమలు అభివృద్ధి పొందిన తరువాత నిరుద్యోగ సమస్య కుటీరపరిశ్రమలస్థితి, గ్రామీణ రైతుల స్థితి ఏవిధంగా ఉండగలదంటారు.

ఈ ప్రణాళిక కాలంలో పరిశ్రమలకు వ్యవసాయాదులకు ప్రభుత్వంవారు 4800 కోట్ల రూపాయలు, ప్రభుత్వేతరులు 2400 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టడంచేత నిరుద్యోగ సమస్య చాలవరకు పరిష్కారం అవుతుంది. ఈ ఖర్చులో కొంతభాగం కుటీర పరిశ్రమలకు వినియోగం కావడంచేత, అందులో పని చేసేవారుకూడ సుఖంగా జీవించగలుగుతారు. నీటి వసతులు, ఎరువులు, పనిముట్లు—వీటి అన్నిటివిషయంలో అనేక లాభకరములైన సౌకర్యాలు ఏర్పడడంచేత వ్యవసాయం మంచి స్థితకి వచ్చి రైతుల పరిస్థితులు చక్కబడతవి. మొత్తంమీద దేశం యొక్క ఆదాయం నూటికి ఇరవై అయిదువతకు పెరుగుతుందని అంచనా వేసిఉన్నారు. ఆ దామాషాన అందరి సౌకర్యాలు వృద్ధిపొందుతవి. కావలసింది ప్రజలలో ఉత్సాహం; ప్రభుత్వంతో సహకారం; దుర్వ్యయం, చేయకుండా ఉండడం; ఆదాయంలో ఎంత సాధ్యమో అంతవరకు మిగిలించుకొని

ప్రభుత్వానికి అప్పుగా ఇవ్వడం; శరీర కష్టం చేయగలవారందరు కష్టపడి పనిచేయడం. 7200 కోట్లు రూపాయలు ప్రణాళికకై వినియోగం కావడానికి ఇట్టి అనుకూల పరిస్థితులుండవలెను. అప్పుడు ప్రణాళిక కొనసాగి, అందరి స్థితి ఇప్పటికంటే చక్కగా ఉంటుంది.

**113.** పత్రిక, రేడియో, ప్రసంగములు—వీటిలో ప్రజాభిప్రాయమును వికసింపచేయుటకు అధికముగా తోడ్పడునదేది ?

పత్రికను చదువగల వారి సంఖ్య దేశంలో చాలా తక్కువ; రేడియోద్వారా ప్రభుత్వాన్ని విమర్శించే అభిప్రాయాల వ్యక్తపరచడం సాధ్యంకాదు. అందుచేత ప్రసంగాలే ప్రస్తుతం ఈ సందర్భంలో ఎక్కువగా తోడ్పడతవి. వాద ప్రతివాదాలకు, భిన్నాభిప్రాయాల వ్యక్తపరచుటకు, సభ్యుల అనుమానాలను తీర్చుటకు ప్రసంగాలు ఉత్తమ సాధనాలు.

**114.** ఉత్పత్తి విధానముల మ వ్యక్తిస్వామ్యము రద్దుచేయబడుట ఎంతవరకు వాంఛనీయము ?

సంఘంలో వ్యక్తికి పూర్తిస్వామ్యం ఉండరాదు. ఒక వ్యక్తియొక్క ప్రవర్తనవల్ల ఇతర వ్యక్తులకు నష్టం, ప్రమాదం సంభవించినప్పుడు అట్టి ప్రవర్తనను నియమబద్ధం చేయడం అవసరం. నియమబద్ధమైన వ్యక్తి స్వామ్యంకూడా కొన్ని పరిస్థితులలో సంఘానికి నష్టకరంగా పరిణమించినప్పుడు దానిని

పూర్తిగా రద్దుచేయవలసిందే. దేశరక్షణకు కావలసిన వస్తువులను ప్రభుత్వం ఉత్పత్తిచేయడం దీనికొక ఉదాహరణము.

**115** ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగా పోతున్న ప్రజాస్వామిక ప్రవక్త శ్రీ జయప్రకాష్ నారాయణ్ భావిని (నెహ్రూ తర్వాత) గురించి మీ అభిప్రాయమేమిటి? ఆ అగ్రనాయకోత్తముణ్ణి రాజకీయాలలో ప్రవేశించవలసినదిగా సలహా యిమ్మని శ్రీ వినోభాజీని కోరగలరా?

శ్రీ జయప్రకాశనారాయన్ రాజకీయాలలో ప్రవేశించి ప్రజాసోషలిస్టుపార్టీ నాయకత్వాన్ని వహించడం దేశశ్రేయస్సు దృష్ట్యా కోరదగ్గది. కాని ఆయన రాజకీయాలలో విశ్వాసం కోల్పోయారు సంఘుప్రసక్తి(?) ప్రజల పరస్పర వర్తనం, నీతి—ఇవే ఆధారమన్న సిద్ధాంతాలలో పడిపోయారు. శ్రీ భావేకూడా అలాంటివారే. ఇట్టి సందర్భాలలో వారు నైతిక రంగలో పనిచేయడమే మంచిది.

**116** ఇండియాలో కమ్యూనిస్టు పార్టీ భవిష్యత్తు ఎలా ఉండగలదు?

రెండవ పంచవర్ష ప్రణాళిక అమలులోకివచ్చి ప్రజల స్థితిగతులు చక్కబడితే కమ్యూనిస్టుపార్టీకి బలం తగ్గుతుంది; లేనియెడల దీనికి బలం ఎక్కువ అవుతుంది. సోవియట్ రష్యా ఇతర దేశాల రాజకీయాలలో ప్రవేశం కలిగించుకోవడం నిజంగా మానితే ఇక్కడి కమ్యూనిస్టుపార్టీ బలం తగ్గుతుంది—

**117.** ఆయుధవిసర్జనపై రష్యా అమెరికాలు చేసే ప్రతిపాదనల్లో ఏవి ఎంతవరకు చిత్తశుద్ధితో కూడుకొని ఉన్నవి?

రాజకీయాలలో చిత్తశుద్ధికి స్థానంలేదు. బాహ్య ప్రవర్తన మొక్కటే గమనించ తగ్గది. కావలసింది ఆయుధ విసర్జన. ఇది చిత్తశుద్ధివల్ల జరిగిందా అనే తర్కం అనవసరం.

**11ప్ర.** బ్రిటిష్ కామన్ వెల్తులో మనదేశం సభ్యరాజ్యంగా ఉండడం అవసరమా? ఇందువల్ల ప్రయోజనమేమి? ఈ సందర్భంలో బ్రిటన్ యొక్క ఆధిపత్యం మనపై చెలామణి అవుతుందా ఏవిధంగానైనా?

కామన్ వెల్తు అనేది ఒక క్లబ్బువంటిది. క్లబ్బులో సభ్యులుగా చేరడం ఆహారం, గాలి, అనవసరమైనట్లు అంత అవసరంకాదు. కాని చాలామంది క్లబ్బులలో చేరుతూ ఉంటారు. పదిమందితో పరిచయం సంపాదించడం దీని ప్రాధానోద్దేశం. ఏకాకిగా కాలం గడపడం కష్టం. మనకష్టసుఖాలు ఇతరులకు చెప్పుకోనడం, వారి కష్టసుఖాల గురించి మనం వినడం మనకు స్వభావం. కామన్ వెల్తులో మనదేశానికి ఉండే సభ్యత్వం ఈలాటిదే. అది లేకపోయినా మనకేమీ విస్తారంలోటు ఉండదు. కాని దానిమూలాన కొంత ప్రయోజనం ఉంది. ప్రపంచ వ్యవహారాలను సరిదిద్దడానికి మనం కోరుతున్నాం. ఇది సఫలం కావడానికి మనం చెప్పిన మాటలను శ్రద్ధతోను ఆదరంతోను విని అర్థం చేసుకొనే రాజ్యాలు కొన్ని ఉండడం అవసరం. కామన్ వెల్తు అట్టి రాజ్యాల సముదాయం. స్నేహితులు ఉండడంవల్ల ఎలాటి ప్రయోజనమో, ఆలాటి ప్రయోజనమే కామన్ వెల్తు సభ్యత్వంవల్ల మనకు లభిస్తున్నది. మనయందు

శత్రుత్వాన్ని ప్రకటిస్తున్న పాకిస్థాన్ కూడా కామన్ వెల్తులో చేరి ఉండడంచేత, ఆ శత్రుత్వం యుద్ధానికి దారితీయకుండా ఉంటూ ఉన్నది, కామన్ వెల్తులోని సభ్యులందరు సరిసమాన మైన హోదాకలవారు. ఒకరిపైన ఇంకొకరికి ఆధిపత్యంలేదు. కామన్ వెల్తులో సభ్యత్వం వదలుకొంటే మనకు కలిగే గొప్ప ప్రమాదం ఏమీ ఉండదు. కాని మనం ఏకాకులై పోతాం. కొత్త మిత్రులను వెతుకుకొనవలసివస్తుంది, ఇంతే కాకుండా బ్రిటిష్‌వారు వారి వలసరాష్ట్రాలకు స్వాతంత్ర్యం ఇచ్చే ప్రయత్నంలో ఉన్నారు. కొద్ది కాలంలోనే మలయా, గోల్డుకోస్టు, నైజీరియా మొదలైన దేశాలు కామన్ వెల్తులో సభ్యత్వం వహించగలగలవు. రంగు జాతుల వారికి ఎక్కువ పలుకుబడి లభిస్తుంది. అట్టి సంస్థలో మనదేశం సభ్యత్వం వహించడం మూలాన మన పలుకుబడికూడా అధికం అవుతుంది.

**119.** ఆంధ్ర ప్రభుత్వంవారిచే నియమించబడ్డ భూసంస్కరణ సంఘం సమర్పించిన నివేదికపై మీ అభిప్రాయం తెలుపగలరా?

మొత్తంపైన నేను ఈ నివేదికలోని సూచనలు అంగీకరించతగినవనియే భావిస్తున్నాను—జమీందారీలు రద్దయిన తర్వాతగా గొప్ప భూసంస్కరణ సమస్య ఏదీలేదు. వందలాది ఎకరాల భూమికి సొంతదార్లయిన రైతులసంఖ్య చాల తక్కువ. వారి ఆస్తులకు గరిష్ఠప్రమాణం విధించరాదని నివేదికలో

సూచింపబడి ఉంది. ఇతర ఆస్తులకు గరిష్టపరిమాణం లేనంత వరకుభూమి ఆస్తి? అలాటి ప్రమాణం నిర్ణయించడం న్యాయం కాదు. "దున్నేవాడిదే భూమి" "భూమి లేనివారందరికీ భూమి వుండవలెను" అనే నివాదాలేగాని ఆచరణయోగ్యాలు కావు. కౌలుదార్లు భూస్వాములకు ఇయ్యవలసినది పండిన పంటలో సగముకంటె మించకూడదని, కౌలుకాలం ఆరు సంవత్సరాల కంటె తగ్గకూడదనీ నివేదికలో సూచింపబడ్డది దీని మూలంగా కౌలుదారులకు అవసరమైన రక్షణలభించింది. వినోబాభావే భూదానోద్యమం గురించిన కొన్ని ప్రశ్నలకు సమాధానం ఇంతకు ముందు నేను చెప్పియున్నాను. ఆ సమాధానాలను ఈ సందర్భంలో చూడటం మంచిది. భూములను పంపకం చేయడానికంటె ఆస్థిమీద ఆదాయంమీదను పన్నులను విధించి, ఆ విధంగా వసూలైన మొత్తాన్ని గ్రామాలలోని ప్రజల సౌకర్యాలకు వినియోగించడం ఉత్తమమార్గం.

**Indian constitution ప్రకారం భారతదేశంలోవున్న పౌరునకు Rights duties ఏవి ?**

Rights (1) పౌరులందరూ సములు (2) అందరికీ వాక్స్వాతంత్ర్యము, సమావేశస్వాతంత్ర్యము, సంచార స్వాతంత్ర్యము, ఆస్తిసంపాదన స్వాతంత్ర్యము, వృత్తి స్వాతంత్ర్యము, సంఘముల స్థాపించుకొను సాతంత్ర్యం వున్నవి. (3) అందరికీ

వారు ఇష్టపడ్డ మతాన్ని అనుసరించు హక్కు వున్నది — ఇవి ముఖ్యమయిన హక్కులు.

Duties ప్రత్యేకంగా ఏవీ విధింపబడలేదు, కాని హక్కులను అనుభవించగోరేవారు కొన్ని నియమాలకు లోబడి శాంతిభద్రతలకు ప్రమాదం కలిగించకుండా ప్రవర్తించవలెననే విధి ఒకటివుంది — వివరాలకు constitution మూడవభాగాన్ని చదవడం మంచిది.

121. యుగోస్లోవియా తిరిగి రష్యా ఉపగ్రహరాజ్యం అయ్యే అవకాశం ఉందంటారా ?

ఆలాటి అవకాశంలేదు. స్వతంత్రంగా ఉండడమే టిటో యొక్క ఉద్దేశ్యం. అందుకుగానే అతడు ఇదివరలో రష్యాను ప్రతిఘటించాడు. ఆప్రతిఘటన సమంజసమైనదని ఇప్పటిరష్యన్ నాయకులు అంగీకరించారు.

122. రష్యా రాజనీతిజ్ఞతలోని మార్పు నమ్మతగినదేనా ?

ఈ మార్పు ఏదో మీరు తెలుసుకొన్నారా ? ప్రధాన ఉద్దేశ్యంలోను ఆదర్శంలోనూ ఏలాటి మార్పూ లేదు—రాదు కూడా—ప్రపంచమందంతా కమ్యూనిజం స్థాపించడమే ఈ ఉద్దేశం—కమ్యూనిజమే పరమార్థమని ఇదివరకు రష్యావారు చెప్పారు; ఇప్పుడూ అదే చెప్తున్నారు—ఈ ఉద్దేశం సాధించడంలో ఇదివరకు యుద్ధం ఒక సాధనంగా వారు అనుకొనేవారు కాని యుద్ధం అంటే అణ్వస్త్రాల ప్రయోగం; దాని మూలంగా

శత్రువులే కాక తాముకూడా నాశనం అవుతామని వారు గ్రహించి తమ ఉద్దేశాన్ని సాధించుకోనడానికి ఇతర సాధనాంతరాలను ఉపయోగిస్తున్నారు. ఇదే వారిలో కలిగిన మార్పు— ప్రచారం, ఆర్థికసహాయం. ఇతర రాజకీయ పక్షాలలోకి కమ్యూనిస్టుల ప్రచ్ఛన్నప్రవేశం మొదలైనవి. ఈ మార్పులోని అంశాలు, వీటిని గుర్తించడం అవసరం.

**123.** మార్క్సు సిద్ధాంతాలలో ప్రధాన వ్యత్యాసం వివరించ కోరుతాను.

వీరిద్దరి మధ్యన అంతా వ్యత్యాసమే. ఏలాటి పోలికా లేదు. 20 వ శతాబ్దంలో భరతఖండ వాతావరణాన్ని దృష్టిలో ఉంచుకొని గాంధీయున్నూ, 19 వ శతాబ్దంలో పారిశ్రామికంగా అభివృద్ధిగాంచిన పశ్చిమ యూరపుయొక్క వాతావరణాన్ని దృష్టిలో ఉంచునికొ మార్క్సున్నూ వారి వారి సిద్ధాంతాలను ప్రతిపాదించారు. గాంధీ దృష్టిలో భరతఖండాన్ని పీడిస్తున్న రోగం పాశ్చాత్యుల సామ్రాజ్యాధికారం, ఆర్థికాధికారం, విజ్ఞానాధికారం. దీనిని తొలగించి, ప్రాచీనకాలపు భారతీయ స్వధర్మాన్ని పునఃప్రతిష్ఠాపన గావించడం వారి సిద్ధాంతంలోని ప్రధానాంశం. గ్రామపంచాయతీలు, కుటీర పరిశ్రమలు, పరిశుద్ధమైన వర్ణాశ్రమ ధర్మం, నిరాడంబర జీవితం ఇందులోని అంశాలు. యంత్రాలు భారీ పరిశ్రమలు దీనికి

విరుద్ధం. మార్క్సు యంత్రాలను భారీపరిశ్రమలను పూజించే వాడు. 'వాటిపై ఎవరికి స్వామ్యం ఉండవలెను?' అనే విషయమే అతడు ఆలోచించింది. ఆ స్వామ్యం వ్యక్తులకుగాక, సంఘానికిన్ని, సంఘానికి ప్రతినిధియైన రాజ్యానికి ఉండవలెనని అతని సిద్ధాంతం. దీని మూలంగా పాశ్చాత్య పారిశ్రామిక నాగరికత ఆరోగ్యవంతం అవుతుందని అతని ఉద్దేశం, ఇద్దరూ వైద్యులవంటివారు. అయితే గాంధీ కుదర్చదలచిన వ్యాధి ఒకటి, మార్క్సు ఎదుర్కొన్న వ్యాధి ఇంకొకటి. అందుచేత ఇద్దరికీ ఏలాటి పోలికా ఉండడానికి వీలులేదు. తత్వవేత్తలంతా రోగాలను కుదర్చదలచే వైద్యులవంటివారని గ్రహించడం అవసరం.

**124.** ప్రభుత్వానికి బలీయమైన ప్రతిపక్షం ఏర్పడేందుకుగాను వచ్చే యెన్నికల్లో ప్రజాసోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీలు ఎన్నికల పొత్తును ఏర్పరచుకొని ముక్కోణపు పోటీలు నివారించుకోనడం వాంఛనీయము కాదా ?

ఇది వాంఛనీయంకాదు. దీనిమూలంగా బలియమైన ప్రతిపక్షం ఏర్పడడం జరగదు, ప్రజాస్వామ్యంలో విశ్వాసం లేనట్టిన్నీ, నియంతృత్వ ప్రభుత్వాన్ని స్థాపించదలచేటట్టిన్నీ కమ్యూనిష్టుపార్టీతో ప్రజాసోషలిస్టుపార్టీకి పొత్తుకుదరడం ఎలాగు ? ఎన్నికలలో పొత్తుకుదిరినా, ఎన్నికల తర్వాత ఇవి

కలసి పనిచేయడం సాధ్యంకానిపనీ. దేశ సౌభాగ్యదృష్ట్యా ఇట్టి పొత్తు వాంఛనీయంకాదు.

**125.** నవచైనాకు ఐక్యరాజ్యసమితి సభ్యత్వం లభిస్తే అమెరికాకు రాగల నష్టం ఏమిటంటారు ?

సమితిలో అమెరికాకు ఉండే పలుకుబడి తగ్గుతుంది. రష్యా పలుకుబడి అధికం అవుతుంది.

**126.** భూమికి గరిష్ట పరిమాణం నిర్ణయించి, అంతకుమించి వున్న భూములను నష్టపరిహారం చెల్లించకుండా పరిభుత్వం తీసుకునేందుకు Provision లేదా? భూమికి బదులుగా భూస్వామికి డబ్బును ముట్ట జెప్పడంలో సంపద సమాన పంపిణి జరగకుండా— డబ్బురూపంగా తిరిగి భూస్వామికి చేరుతుందికదా? సామ్యవాద సూత్రాలను అనుసరించి, ఇది సమంజసమేనా?

(1) భూమికి గరిష్ట పరిమాణం నిర్ణయించడం రాజ్యాంగానికి విరుద్ధంకాదు; (2) కాని నష్టపరిహారం చెల్లించకుండా భూములను వశం చేసుకొనడం దానికి విరుద్ధం (3) డబ్బు ఇవ్వడంవల్ల సమానపంపిణీ జరగకపోవడం వాస్తవమే. కాని సామ్యవాదసూత్రంలో సంపద అంతా సమానంగా పంచవలెనని ఎక్కడాలేదు. సమాన పంపకం ఇదివరకు ఎన్నడూ ఎక్కడా జరగలేదు. సోవియట్ రష్యాలోకూడా ఇట్టిదిలేదు. తరతమ భేదాలను కొంతవరకు తగ్గించడం మంచిదేకాని, ఆర్థికంగా వ్యక్తులందరు సమసంపదలు కలవారై ఉండవలెనని చెప్పడం

ఆచరణయోగ్యం కాకపోవడమే కాకుండా, సమాజ శ్రేయస్సుకు భంగకరం, సమత్వం అంటే ఏమిటో కొంచెం లోతుగాను శ్రద్ధతోడను ఆలోచించండి.

**127.** గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతం (Doctrine of Trusteeship) ఆచరణ సాధ్యమైనదేనా? దీనివల్ల సంఘపు ఆర్థిక వ్యవస్థల్లో మార్పు రావడం సంభవమా?

సిద్ధాంతం ఆదర్శదృష్ట్యా చాలా ఉన్నతమైనదేకాని, అది కొంతవరకు మాత్రమే. ఆచరణయోగ్యం–తన యొక్కయు తన కుటుంబంయొక్కయు అవసరాలకు మించి ఎవరూ ధనం కూడబెట్టరాదు. అలాటిధనాన్ని, తక్కువ ఆదాయం కల వారికి దానంచేసి, వారి అవసరాలు తీరడంలో సహాయంచేయవలెనని ఈ సిద్ధాంతం చెప్తుంది. ఇది చాలా ప్రాచీనసిద్ధాంతం గాంధీజీ దానిని పునరుద్ఘాటించారు. కాని దీని ప్రకారం నడుచుకొనేవారి సంఖ్య చాల తక్కువ. ఇంతేకాకుండా వ్యక్తులకు వారికుటుంబాలకు ఇది అవసరం కాదు, అని నిర్ణయించడం ఏలాగు? అది నిర్ణయించేవారు ఎవరు? నిర్ణయించినా దానిని అమలులో ఉంచడం ఎలాగు? అందుచేత ధనికునివద్ద నుండి పన్నులమూలంగా ధనాన్ని నిర్బంధంగా తీసుకొని, సంఘశ్రేయస్సుకై వినియోగించడం అనాదిగా జరుగుతూవుంది. క్షత్రియవర్గం (పరిపాలకవర్గం) లేకుండా, నీతిసూత్రాలమీదనే సంఘం నిలబడజాలదు. సిద్ధాంతం—మనం ఏ మార్గాన నడవ

డం మంచిదో సూచిస్తుందికాని, ఆ మార్గంలోనే మనం నడిచే ట్లు చేయగల బలం దానికి లేదు.

**128.** ఇప్పుడు భూసంస్కరణలు అమలు జరిపితే, రైతు దెబ్బతింటాడు అనే వాదం ఎంత వరకు సమర్థనీయం? భూమితో బాటు మిగతా ఆస్తులు ఆదాయమునకుగూడ ఒక గరిష్ఠ పరిమాణము ఉండవలెనా?

భూసంస్కరణముల ఉద్దేశం రైతును బాగుజేయడం. వాటివలన రైతు దెబ్బతింటాడు అని అనడం అర్థంలేనిమాట. సంస్కరణల నన్నిటిని ఇప్పుడే చేయడం మంచిది. పొరపాటు ఎక్కడ వస్తున్నదంటే ఏవి నిజమైన సంస్కరణలో ఏవి కావో విచక్షణచేయడంలో సంస్కరణ అంటే మార్పు అన్న ధోరణిని ఒక్కొక్కప్పుడు రయితుకు ఏ విధంగాకూడా లాభించని మార్పులు చేయబడుతున్నవి. కొన్ని నెలల క్రిందట ఆంధ్ర ప్రభుత్వంవారు చేసిన కౌలుదారీ చట్టం ఈలాటిదే.

ఆస్థులకు ఆదాయానికి గరిష్ఠ ప్రమాణం ఒకటి వుండడం న్యాయమని అంగీకరించినప్పుడు అది ఒక భూమికే కాకుండా అన్నిరకములైన ఆస్తులకు ఆదాయానికి వర్తించవలసి ఉన్నది. భూమి ప్రకృతి కల్పితము, తక్కినవి మానవ కల్పితములు అన్న వాదంలో సత్యంలేదు– వ్యవసాయ యోగ్యంగా భూమిని మార్చినప్పుడే దానికి విలువ, ప్రయోజనము. ఆ మార్పు మానవ కల్పితము.

**129.** భూసంస్కరణలు ఏవిధంగా ఉండవలెనో మీ అభిప్రాయం వ్రాయకోరెదను.

1) భూసంస్కరణలవలన భూమినుండి గరిష్ట పంటలు పండించడానికి సాధ్యమవుతుందో అట్టి సంస్కరణే మనం కోరతగ్గది. 2) పంటను పండించడంలో ఎవరెవరు సహకరిస్తున్నారో వారందరు వారివారి సహకార స్వభావాన్ని బట్టి విభాగంచేసుకోవడం న్యాయం, ఏ సంస్కరణవలన అలాంటి విభాగం జరుగుతోందో అదేమనం కోరతగ్గది. భూసంస్కరణల వలన ఈ రెండు ఆశయాలు సిద్ధించవలెను.

**130.** రష్యన్ కమ్యూనిస్టు జీవితంలో మానవత్వానికి ప్రాణదాత లయిన అధ్యాత్మిక నైతిక దృష్టితో చూస్తే కనబడు ముఖ్యలోపములేవి? అసలు కమ్యూనిస్టు ఆదర్శాలు మన అధ్యాత్మిక విశ్వాసానికి తోడ్పడతవా? ఎందుచేత?

కమ్యూనిస్టు సిద్ధాంతంలో ఆధ్యాత్మిక చింతకు స్థానమేలేదు. ఇంద్రియాలకు గోచరించని ప్రపంచంగాని సత్యంగాని ఒకటి ఉన్నదని అది అంగీకరించదు. దాని పరమావధి ఐహికసౌఖ్యం ఒక్కటే. అందుచేత కమ్యూనిస్టుతత్వం ఆచరణలోకి వచ్చినప్పుడు మానవునికి లభించేది ఇంద్రియాలుకోరే వివిధములైన భోగపదార్థాలు. కాని ఇవి మనస్సుకు శాంతినిగాని సౌఖ్యాన్నిగాని కలిగింపలేవు. అధ్యాత్మిక జీవితం యొక్క పరమావధి శాంతి, శాశ్వత సుఖం, భోగభాగ్యాలు ఇన్ని ఉన్నా మానవు

నికి దుఃఖంతప్పదు, బంధువులు, మిత్రులు అకాల మరణం పొందుతారు, తాను అనుకొనినది సర్వదా ఫలింపదు. దుఃఖానికి ఇదేకారణం. కమ్యూనిజంలో దీనికి ప్రతిక్రియ ఏమీ లేదు. ఇంతేకాకుండా ఈవిధానంలో మానవ స్వాతంత్ర్యానికి స్థానంలేదు.

**131.** కేంద్రీకృత, వికేంద్రీకృత విధానములు అనగా నేమో సోదాహరణముగా వివరించగోరుతాను.

దేశంలో పరిపాలనమంతా మూడు అంతస్థులలో ఉండే సంస్థల ద్వారా జరుగుతూవుంది. ఢిల్లీలో ఉండే కేంద్రప్రభుత్వం ఉత్తమస్థానంలోవుంది. మధ్యమస్థానంలో రాష్ట్రప్రభుత్వాలు; క్రిందిస్థానంలో జిల్లాబోర్డులు, పంచాయితీలు మున్సిపాలిటీలు వగైరా. అధికారం అంతా ఢిల్లీలోవుండే ప్రభుత్వం చేతులలో ఉండడం వారు ఎలాగుచెప్తే అలాగు తూచా తప్పకుండా తక్కిన రెండు ప్రభుత్వాలు నడుచుకొంటూ ఉండడం, కేంద్రీకృత ప్రభుత్వం అని చెప్పవలసివస్తుంది. అలాగు కాకుండా రాష్ట్రప్రభుత్వాలు కొన్నివిషయాలలో సర్వస్వాతంత్రం కలిగివుండడం, లోకల్‌బోర్డులవంటి స్థానికప్రభుత్వాలు మరి కొన్నిటిలో స్వతంత్రం కలిగి ఉండడం జరిగితే ప్రభుత్వం వికేంద్రీకృతం అవుతుంది. గ్రామానికి సంబంధించిన వ్యవహారాలన్నీ గ్రామప్రజలు వారెన్నుకున్న పంచాయతీలు—

నిర్వహించడం వికేంద్రీకృతం. అలా కాకుండా రాష్ట్రప్రభుత్వం వారు కాని, ఢిల్లీ ప్రభుత్వంవారు కాని నియమించిన ఉద్యోగస్థులు ఈ వ్యవహారాలను నడపడం కేంద్రీకృతం.

182 సోషలిజంకు సోషలిస్టు పేటరన్ ఆఫ్ సొసైటీకి గల భేదమేమి?

సిరిసంపదలలో మనుష్యులమధ్య తరతమ భేదములు లేని పరిపక్వమయిన సమాజము సోషలిజంతో గూడిన సమాజం. అలాంటి సమాజమును క్రమక్రమంగా సృష్టించే ప్రయత్నంతో కూడుకొన్నది సోషలిస్టు పేటరన్. సోషలిజం ఒక ఆదర్శం. సోషలిస్టు పేటరన్ ఆ ఆదర్శాన్ని సాధించడానికి చేసే ప్రయత్నాన్ని సూచిస్తుంది.

183. సోషలిస్టు సమాజంలో అడుగు పడుతున్న యీ శుభసమయంలో గ్రామీణాభివృద్ధికి Doctrine of Lapse ఎంతో వుపకరిస్తుందనే నా అభిప్రాయం ఎంతవరకు సమర్థనీయమో తెలుపగోరుతాను.

వారసులు లేనివారు దత్తస్వీకారం చేయరాదని వారి ఆస్తినంతా ప్రభుత్వం వశపరచుకొనవలెనని మీరు అభిప్రాయపడుచున్నారు. ఈ లాటి వారిసంఖ్య చాలా తక్కువ. వీరందరికి ఎక్కువ ఆస్తులు లేకపోవచ్చు. ఈలాటి సందర్భంలో ఇది తరతమ భేదాలు నశించుటకు విస్తారం తోడ్పడదు. లేనిపోని ఆందోళనకు కారణం అవుతుంది. ఎక్కువ పన్నులు విధించడం-ముఖ్యముగా మరణ సుంకాలను ఎక్కువ చేయుటం దీనికంటె ఎక్కువ ఫలవంతంగా ఉంటుంది.

134. 'బోల్షివిజ' మనగా నేమి? ఈసిద్ధాంతమును ప్రవేశపెట్టినదెవరు?

బోల్షివిజమనేది ఒక ప్రత్యేక సిద్ధాంతముకాదు. కమ్యూనిజమునకు ఇది నామాంతరమని చెప్పవచ్చును. కమ్యూనిజాన్ని హేళనచేసేవారు ఈ మాటను వాడుతుంటారు. 1903 ప్రాంతాన రష్యాలోని "సోషల్ డెమాక్రాటిక్" పార్టీలో అతివాదులమధ్య మితవాదులమధ్య సిద్ధాంతముల విషయమై తీవ్రమైన అభిప్రాయభేదములు కలిగెను. చర్చలలో లెనిన్ నాయకత్వాన ఏర్పడిన అతివాదులవైపు అధికసంఖ్యాకులు (మెజారిటీ) మొగ్గిరి. రష్యన్ భాషలో మెజారిటీ అనేమాటకు పర్యాయపదము బోల్షివిస్టో. ఆ కారణంచేత చర్చల్లో విజయముపొందిన లెనిన్‌పార్టీకి బోల్షివిక్ పార్టీ అని పేరు వచ్చెను. 1917 లో రష్యాలో సంభవించిన 'కమ్యూనిస్టు' విప్లవము లెనిన్ నాయకుడైన బోల్షివిక్‌పార్టీ ఆధ్వర్యాన జరిగెను. అప్పటినుండి బోల్షివిజం, కమ్యూనిజం పర్యాయ పదములయ్యెను.

135 ఆహార సమస్యా పరిష్కారానికి కుటుంబ నియమము (Family planning) ఒక్కటే మార్గ మంటారా?

ఇది ఒక్కటే మార్గముకాదు. దేశములో ఉత్పత్తి అయ్యే ఆహారధాన్యాలను ఇప్పటికంటె ఎక్కువగా ఉత్పత్తి చేయుటయు, విదేశములనుండి వాటిని కొని తెచ్చుకొనుటయు మరికొన్ని మార్గములు. వ్యవసాయములో నూతన పద్ధతులను ప్రవేశపెట్టుట, రసాయనిక ఎరువులను వాడుట, నూతన జలా

ధారములను కల్పించుకొనుట—ఈలాటి వాటి మూలమున ఎక్కువ పంటలను పండించి, ఆహార సమస్యను కొంతవరకు పరిష్కరించుకొన వచ్చును. కాని, వీటిమూలమున కలుగు ఫలితమునకు ఒకహద్దు కలదు. పెరిగిపోవుచుండు జనసంఖ్యకు సరిపడునంతటి ఆహార ధాన్యాదులను వీటిమూలమున పండించుటకు సాధ్యముకాదని నిపుణుల అభిప్రాయము. అందుచేత దేశములోని జనసంఖ్యయొక్క పెరుగుదలకు ఒక హద్దును కల్పించుకొనుట అత్యవసరము, Family planning యొక్క ఉద్దేశమిది. పాశ్చాత్యదేశములలోని వారు మనకంటె ఎక్కువగ సుఖించుటకు Family planning ఒక ప్రధాన కారణము.

186. అంతర్జాతీయరంగంలో మన సచేతన తాటస్థ్యం విజయవంతమైన ఫలితాల నిస్తుందా ?

అంతర్జాతీయ రంగంలో మనం కోరతగిన ఫలితాలేవో తెలుసుకొనినగాని ఈ ప్రశ్నకు సమాధానం లభించదు. (1) ఇతర రాజ్యాల దండయాత్రలవలన మన దేశానికి ఎట్టి ప్రమాదం సంభవించకుండా ఉండడం, (2) దండయాత్రలు చేయక పోయినా, మన దేశంలోపల కుట్రలు పన్ని ప్రచ్ఛన్న అంతర్యుద్ధం, బహిరంగమైన అంతర్యుద్ధం లేవదీయకుండా ఉండేటట్లు మనం మన శాంతిభద్రతలను కాపాడుకొనడం; (3) మన స్వాతంత్ర్యానికి భంగం లేనట్లు యితర రాజ్యాలనుండి తగు మాత్రపు ఆర్థికసహాయము సంపాదించడం;—ఇవి మనం ప్రధా

నంగా కోరతగిన ఫలితాలు. తాటస్థ్య విధానంవల్ల కొంతవరకు ఈ ఫలితాలను మనం పొందగల్గుతున్నాం. ఈలాగు కాకుండా మనం అమెరికా పక్షముచేరితే, చైనా రష్యాల మూలంగా మనకు ప్రమాదం సంభవించివుండేది– కాశ్మీరు, నేపాలు మొదలైన సరిహద్దు ప్రాంతాలలో కమ్యూనిస్టు ఉపద్రవం సంభవించేది–రష్యా పక్షంచేరితే అమెరికామూలంగాను, అమెరికా కూటంలో చేరిన పాకిస్తాన్ మూలంగాను ఇట్టి ప్రమాదం కలుగుతుంది. మనం ఎవరిపక్షం చేరకపోవడంచేతనే ఈ ప్రమాదాలు చాలవరకు తప్పిపోయినవి.

అయితే నిజంగా మనవిధానం తటస్థమైందా కాదా అనేవిషయమై అభిప్రాయ భేదాలు లేకపోలేదు. సైనిక ఒడంబడికల దృష్ట్యామనం ఏపక్షంలోను చేరలేదుగాని, ఉభయఃపక్షములమధ్యన అభిప్రాయ భేదములు కలిగినప్పుడు మనం సామాన్యంగా రషియా–చైనాల అభిప్రాయములను సమర్థించడం జరుగుతున్నదని చెప్పేవారు లేకపోలేదు. ఈ కారణంచేత మనం కోరే ఫలితాలు పూర్తిగా మనకు లభించుటలేదు.

187. కార్మిక నియంతృత్వంలో సోషలిజం స్థాపనకు అవకాశం ఉందంటారా ?

అవకాశం లేకపోలేదు. దేశంలో ఉత్పత్తి అయ్యే ధన ధాన్యాదులను విస్తార తరతమ భేదాలులేక న్యాయదృష్ట్యా

ప్రజలందరికీ ప్రభుత్వము పంచి పెట్టడమే సోషలిజం. ఇట్టి ప..కం ఈ పంపకానికి కావలసిన ఏర్పాటులు—పీటన్ని..టని ..ర్మిక నియంతృత్వ ప్రభుత్వం చేయడం సాధ్యమే. కాని ఈ ..ద ర్భంలో కొన్ని విషయములను గమనించవలసి ఉన్నది. (1) కార్మిక నియంతృత్వం అంటే కార్మికులందరు కలసి స్వేచ్ఛగా ఎన్నుకొన్న ప్రభుత్వం కాదు. ఆ నియంతృత్వంలోని పరిపాలకు లను మార్చుటకుగాని, వారనుసరించు విధానాలను విమర్శించి, విధానాంతరాలను సూచించుటకుగాని కార్మికులకు అధికారము లేదు. కార్మిక నియంతృత్వమంటే కార్మికుల శ్రేయస్సుకై పాటుబడుచుండునట్లు చెప్పే నియంతృత్వం. నిశ్చయముగా అది ఆవిధంగా పాటుపడుచున్నదీ, లేనిదీ, తేల్చడానికి ఎవరికీ అధికారంలేదు. 'విప్రు..చెప్పిందే వేదం' అన్నట్లు అధికారంలో ఉంటే ఏస్టాలినో, ఏబుల్గానినో చెప్పింది శిరసావహించవలసిందే. (2) నియంతృత్వ విధానంలో నియంతలకు ఏది న్యాయం అని తోస్తుందో అది జరుగుతుందే కాని స్వచ్ఛమైన న్యాయం చేకూరదు. కార్మికులు, పెట్టుబడిదార్లు అనేభేదం పోతుంది గాని కార్మికులు, ఉద్యోగులు అనే భేదం ఏర్పడుతుంది. వ్యవ సాయం, పరిశ్రమలు, వర్తకవ్యాపారాలు, ఉత్పత్తివినిమయాదు లన్నీ ప్రభుత్వయాజమాన్యాన జరగడంచేత ఉద్యోగవర్గం ఒకటి ప్రబలంగా పెరిగిపోతుంది. వారి అధికారానికి మితిమేర

లుండవు. వారు, వారి కుటుంబంలోనివారు, వారి సంబంధీకులు ఎక్కువ సుఖాన్ని అనుభవించడం జరుగుతుంది. ఒక విధమైన తరతమ భేదంపోయి, ఇంకొకభేదం ఏర్పడుతుంది. దానిని ఖండించడానికి నియంతృత్వంలో ప్రజలకు ఎట్టి అవకాశంలేదు. కార్మికులలో కొన్ని వర్గాలవారికి——ఫ్యాక్టరీలలో పనిచేసేవారికి—ఎక్కువ వేతనాలు, వ్యవసాయదార్లకు తక్కువ వేతనాలు లభించవచ్చు (3) నియంతృత్వంద్వారా ఏర్పడే సోషలిస్టువ్యవస్థ దౌర్జన్యంతోను రక్తపాతంతోను కూడుకొన్నది. ఎదటి పక్షం వారికి నచ్చచెప్పి, కాలక్రమేణా సంఘాన్ని సంస్కరించే పద్ధతిని నియంతలనుసరించరు. ఎదిరించినవారిని, విమర్శచేసేవారిని హతమార్చి, తమ ఆశయాలను సాఫల్యం చేసుకొంటారు. ఆశయం ఎంత ఉన్నతమైనదైనా, దానిని రక్తపాతంద్వారా సాధించడం వాంఛనీయం కాదని అభిప్రాయపడేవారు నియంతృత్వానికి అంగీకరించజాలరు.

గనుక కార్మిక నియంతృత్వంద్వారా సోషలిజాన్ని స్థాపించడానికి అవకాశం ఉన్నా అది లోపాలతోకూడిన సోషలిజం అవుతుందనిన్ని, దాని స్థాపన విపరీతమైన రక్తపాతంతో కూడుకొన్నదనిన్ని గమనించవలసిఉన్నది.

**188.** మన ప్రభుత్వపు పారిశ్రామికవిధానం ప్రస్తుత వ్యవస్థలోని మార్పులపట్ల విఫలమవుతుందంటారా ?

ప్రస్తుతవ్యవస్థ సోషలిజం విధానాన్ని అనుసరించి మారవలసిందింగా ఉన్నట్లు అందరు అంగీకరిస్తున్నారు. మన ప్రభుత్వ పారిశ్రామిక విధానం సోషలిస్టు సమాజాన్ని నిర్మాణం చేయగలదా అనేదే మీప్రశ్న—ఈలాటి నిర్మాణానికి అది సహాయపడగలదని చెప్పవచ్చును. సోషలిస్టు సమాజస్థాపనకు ప్రధాన పరిశ్రమలు జాతీయం కావడం అంటే ప్రభుత్వపరం కావడం—ఒక ప్రధానసాధనం—మన ప్రభుత్వం చాలావరకు ఈ సాధనాన్ని ఉపయోగిస్తున్నది. ప్రైవేటు రంగంలో ఉండే పరిశ్రమలను కూడ నియమబద్ధం చేస్తూఉన్నది. అందుచేత వ్యక్తులమధ్య ఏర్పడే తరతమభేదాలు తగ్గి, ఆర్థికసమత్వం ఏర్పడడానికి అవకాశం కలుగుతున్నది.

**189.** ప్రపంచమారణహోమం జరిపే అణ్వాయుధాల నిషేధంపై భద్రతాసమితికి బాధ్యతలేదా ?

బాధ్యత ఉన్నది కాని దీన్ని నిర్వహించే స్థితిలో భద్రతాసమితిలేదు. రష్యా, అమెరికాలు అంగీకరిస్తేకానీ ఆ సమితిలో ఏ తీర్మానం చెయ్యడానికి సాధ్యముకాదు. ఈ రెండింటికి ఈ విషయములో ఇంతవరకు అంగీకారం కుదురలేదు. ప్రస్తుతము లండన్‌లో ఇందువిషయమై కొన్ని సంప్రతింపులు జరుగుతున్నవి. అవి ఫలిస్తే అణ్వాయుధాల నిషేధం సాధ్యం కావచ్చు.

# విద్య: సమగ్ర చర్చ

140. ప్రాథమిక విద్యలో లోపాలుఏమిటి? మాధ్యమిక విద్యలో లోపాలేమిటి? యూనివర్సిటీ విద్యలో లోపాలు ఏమిటి? వాటిని ఎలా సవరించాలి?

ఒక్కొక ప్రశ్నకు ఒక్కొక వ్యాసము వ్రాస్తేనేకాని జవాబు చెప్పడము సాధ్యముకాదు. ప్రస్తుతము ఏదీకూడా నిజమైన విద్యకాదు. సంఘములోని ప్రతివ్యక్తి నేర్చుకొనవలసిన కనీస (Minimum) విద్యకు ప్రాథమిక విద్య అని పేరు. అది అందరికి జీవనోపాధిని కల్పించగలదిగ ఉండవలెను. ఆ జీవనోపాధి దేశములోని పరిస్థితుల కనుగుణముగ నుండవలెను. దీనితోపాటు శారీరక, మానసిక, నైతిక బలాలను పెంపొందించే శక్తి దానిమూలాన లభించవలెను. ఇవి ఇప్పుడు జరగడంలేదు, తెలివి తేటలలోను, నేర్పులోను వ్యక్తులందరు సరి సమానులు కారు. ఎక్కువ తెలివితేటలు, నేర్పు గలవారిని కేటాయించి, అట్టి వారికి అనుగుణమైన విద్యను నేర్పుటయె మాధ్యమిక విద్య యొక్క ఉద్దేశముగా ఉండవలెను. ఇట్టి కేటాయింపు యిప్పుడు జరగడములేదు. వివిధ రంగాలలో—రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక రంగాలలో—నాయకత్వము వహించతగ్గ వారిని తర్ఫీదు చేయుటయే—యూనివర్సిటీ విద్యయొక్క ఉద్దేశం కాని ప్రస్తుతము ఈ ఉద్దేశము నెరవేరడములేదు. విద్యయొక్క ఉద్దేశం ప్రభుత్వ ఉద్యోగాలను సంపాదించడము అనే అభిప్రాయము అడుగంటితేనేగాని, యెలాటి సవరణ సాధ్యముకాదు.

**141.** నవభారతంలో విద్యావిధానము యెలా ఉండాలి ?

విద్యార్థుల జీవనోపాధికి సహాయపడేదిగాను, వారి జీవితాన్ని నియమబద్ధంగాను సాంప్రదాయానుగుణంగాను చేయ దగినదిగాను, వారి దృక్పథాన్ని విశాలంగా చేయగలదిగాను ఉండవలెను. ప్రస్తుత విద్యా విధానానికి ఈ లక్షణాలులేవు.

**142.** స్త్రీ చదువుకొనుటవలన ఉపయోగముందంటారా ?

చదువుకొన్న మాత్రముచేత ఉపయోగము ఉండదు. సంఘములో స్త్రీ నిర్వహించవలసిన పాత్రకు ఆ చదువు అను గుణమైనప్పుడే దానివలన ఉపయోగము. యిప్పటి చదువు ద్వారా ఇది జరగడములేదు.

**143.** చదువు సంస్కారం కొరకంటారా లేక బ్రతుకు తెరువు కంటారా ?

రెండింటికి, మానవుడికి ఈ రెండూ అవసరం.

**144.** హిందీద్వారా యిప్పటిలో ఇండియా అంతట విద్య జరగ టాన్ని మీరంగీకరించగలరా ?

అంగీకరించను, విద్యాబోధ మాతృభాషద్వారా జరగ వలసిందే. పరాయి భాష పనికిరాదు. దక్షిణ భారతదేశం లోని వారికి హిందీ పరాయిభాష.

**145.** మార్క్సుల వేటతో ప్యాసయ్యే యీ విద్యావిధానము యెప్పటికి మారుతుందంటారు ?

పిల్లలు విద్యావంతులు కావలెనను అభిలాష తల్లిదండ్రులలోను, ఉపాధ్యాయులలోను, దేశాన్ని పాలించేవారిలోను కలిగినప్పుడే మారుతుంది. అయిదు సంవత్సరాలపాటు విద్యాలయాలు కట్టిపెట్టిన యెడల కొంత మార్పు రాగలదు.

**146.** స్వతంత్ర భారతం, అన్ని రంగాలలో పురోగమిస్తున్నా, విద్యారంగంలో తిరోగమిస్తుందేమిటి ?

తిరోగ మిస్తుందనుటకు ఆధారం లేదు. దేశంలోని విద్యాలయాల సంఖ్య పెరుగుతున్నది. కొత్త విశ్వ విద్యాలయాలు స్థాపింపబడ్డవి. సాంకేతిక విద్యను, వృత్తి విద్యలను నేర్పు కళాశాలల సంఖ్యకూడ ఎక్కువ అవుతున్నది. వీటి అన్నిటిలో చదువుకొనేవారి సంఖ్యకూడ పెరుగుతున్నది. అన్ని వర్గాలవారు, పురుషులతోపాటు స్త్రీలు, పూర్వంకంటె ఇప్పుడు ఎక్కువగా విద్య నభ్యసిస్తున్నారు. ఈ పరిస్థితులలో దేశం, విద్యారంగంలో తిరోగమిస్తున్నదని దేనినిబట్టి మీరు అభిప్రాయ పడ్తున్నారో స్పష్టం కాలేదు. 1950—51 లో విద్యకుగాను ప్రభుత్వం 19.5 కోట్లు ఖర్చుపెట్టింది. 1954—55 లో 40.3 కోట్లు ఖర్చుపెట్టింది. మొత్తం పెరిగిందేగాని, విద్యామానం దాని కనుగుణంగా పెరగలేదంటూరా ? దానిని విశద పరచండి.

**147.** నూతన విద్యావిధానం అమలులోకి వచ్చుటకు విద్యార్థుల కర్తవ్యం ఏమిటి ?

ఆ విధానంతో పూర్తిగా సహకరించడమే వారి కర్తవ్యం. ఒక విషయం ఆలోచించండి. ఇదివరకు ఉండిన విద్య గుమాస్తాలను తయారు చేయడానికి మాత్రమే పనికివచ్చిందన్న కారణాని వ్యవసాయం, పరిశ్రమలు మొదలగు వృత్తులలో ప్రవేశించడానికి తగినట్లుగా విద్యావిధానాన్ని మారుస్తున్నారు. నూతన విధానానికి ఇది ప్రధానలక్షణం. , కాని విద్యార్థుల మనస్తత్వం ఇంకా మారలేదు. ఈలాటి వృత్తి విద్యలలో ప్రవేశించే ఉత్సాహం వీరిలో ఇంకా రేకెత్తలేదు. గనుక పూర్వకాలపు ధోరణినిమాని, నూతనంగా కల్పించబడ్డ అవకాశాలను విద్యార్థులు వినియోగించుకొనడమే వారికర్తవ్యం.

**148.** తెలుగు మేస్టరుపై విద్యార్థులకు చిన్నచూపు ఎందుకు ?

తెలుగు మేష్టారు జీతంతక్కువ. ఆయన వేషం చాందసంగా ఉంటుంది. అయితే ఈకాలంలో మేష్టార్లందరిపైన చిన్నచూపేకదా ?

**149.** ఇంటర్మీడియేట్, బి. ఏ పరీక్షలకు ప్రైవేటుగా హాజరవుతున్న స్త్రీలతోపాటు పురుషులకు గూడా ఎందుకు అవకాశం కల్పించకూడదు ?

విద్యలో స్త్రీలు వెనుకబడి ఉండడంచేతను, కళాశాలలో ప్రవేశించి విద్య నేర్చుకొనుటకు స్త్రీలకు కావలసిన

ప్రత్యేక సౌకర్యాలు లేకపోవుటచేతను, వారికి ఈలాటి అవకాశం కల్పించబడ్డది. ఇది ఆపద్ధర్మంగా భావించవలెను. కొన్ని పరిస్థితులలో పురుషులకుకూడా ఈలాంటి అవకాశాలు కల్పింపబడి ఉన్నవి. విద్యయొక్క ఉద్దేశం పరీక్షలలో కృతార్థులు కావడం మాత్రమే కాదనిన్నీ ఆ ఉద్దేశం నెరవేరడంలో కళాశాలలో ఉపాధ్యాయులవద్ద విద్య నేర్చుకొనడం, తక్కిన విద్యార్థులమధ్య కొన్ని సంవత్సరాలు జీవితం గడపడం, ప్రధాన సాధనాలన్న ప్రాతిపదికపై విద్యావిధానం ఏర్పడింది. ఈ ఏర్పాటు ఫలితమే పురుషులు ప్రైవేటుగా పరీక్షలకు వెళ్లే అవకాశం లేకపోవడం. ఈ ప్రాతిపదికలో సత్యం లేదంటారా ?

150. విద్యార్థులు పాల్గొనవలసిన దేశీయ నిర్మాణ కార్యక్రమాలు ప్రస్తుతానికి ఏవి ?

వారు నేర్చుకొనవలసిన విద్యలను పూర్తిగా నేర్చుకొని ఉత్తమ పౌరులుగ తయారుకావడం మొదటి కార్యక్రమం. ఈ కార్యాన్ని కొనసాగించుకుంటూ, తీరిక సమయాలలో కొంత వయస్సు వచ్చిన విద్యార్థులు—15,16 సంవత్సరాలు దాటినవారు—సమీప గ్రామములకు వెళ్ళి, అచ్చట ప్రజలు విద్యావంతులగునట్లు చేయుట రెండవ కార్యక్రమం. విద్యావంతులు చేయగల సేవ విద్యావిదానమే కదా ? వయోజన విద్యా కార్యక్రమం చాలా విశాలమైంది. దానిని కొనసాగిస్తే,

గ్రామంలోనివారు అక్షరాస్యులు కావడమే కాకుండా, గ్రామం లోని వ్యవహారాలనన్నిటినీ—పరిశుభ్రత మొదలైన వాటిని— సరిదిద్దుకోగల వారవుతారు.

151. విద్యార్థుల భాషాభివృద్ధికి తోడ్పడే సరియైన నీతి చిత్రాలు తీయటంలో ప్రభుత్వమూ, నిర్మాతలతో ఏందుకు సహకరించడంలేదు ?

(1) కొంతవరకు ప్రభుత్వం సహకరిస్తూనే ఉంది. ఈ మధ్యన దీనినిగురించి ప్రభుత్వంవారు ఎక్కువగా ప్రచారం చేయడం జరుగుతూ ఉంది.

(2) పూర్తి సహకారం దొరకక పోవడానికి కారణం ప్రభుత్వం చేయవలసిన పనులు ఎన్నో ఉన్నాయి. అన్నీ ఒక సారి చేయడానికి కావలసిన ద్రవ్యం, శ్రద్ధ ప్రభుత్వానికి లేదు.

3) ప్రభుత్వం వద్దనుండి విస్తారమైన సహాయం అపే క్షించకుండా నిర్మాతలు దేశాభిమానాన్ని ఆధారం చేసుకొని ఈ పనిని సాగించడం మంచిది. ప్రతి విషయానికి ప్రభుత్వ సహా యం అపేక్షించడం మంచిదికాదు.

152. విశాలాంధ్రలోని మూడు విశ్వవిద్యాలయాలు ధనాభావంవల్ల ప్రగతిని పొందలేక పోతున్నాయిగదా ? మరి వీటి నిర్వహణకు మీరిచ్చే సలహా ఏమిటి ?

ప్రగతిని పొందలేక పోతున్నాయని అనుకోవడం పొర పాటు. మన విశ్వవిద్యాలయాల ప్రధాన ఆదర్శం పట్టభద్రులను

తయారుచేయడం, ఏటేట పట్టభద్రుల సంఖ్య పెరిగిపోతున్నది. పరీక్షలలో సులభకరంగా కృతార్థులు కావడానికి నూతన మార్గాలు కనుగొంటున్నారు. ఇంతకంటే ఉన్నతమైన ఆదర్శం లేకపోవడమే విచారించ తగ్గవిషయం. విజ్ఞానాభివృద్ధి విశ్వ విద్యాలయాలకు ఆదర్శం అయిననాడు ధనాభావం ఒక ఆటం కంగా ఉండదు. ఇంతకూ మనకు కావలసింది ఈమూడు విశ్వ విద్యాలయాలవంటి విద్యాలయాలా ? అనేది ప్రశ్న. ఎట్టివి అవసరమో రాధాకృష్ణన్ కమీషన్‌వారు ఎనిమిది సంవత్సరాల క్రింద సూచించారు. కాని ఆ సూచన బుట్ట దాఖలైంది.

158. ప్రాథమిక విద్యాపాఠశాలలన్నీ మునిసిపల్ మరియు జిల్లా బోర్డుల ఆధిపత్యం క్రిందకు తీసుకు రావాలని డా॥ లోహియా అంటుంటే శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారు అదే పాఠశాలలను జిల్లాబోర్డుల ఆధిపత్యం తప్పించడం విద్యాప్రమాణాల అభివృద్ధికి అవసరం అంటున్నారుగదా ? ఎవరి అభిప్రాయం గణనీయమైన దంటారు ?

ప్రాథమిక పాఠశాలను నడిపే బాధ్యత పట్టణాలలో మునిసిపల్ సంఘాలున్నూ, పల్లెలలో గ్రామపంచాయతీలున్నూ వహించడం సవ్యమైన మార్గం, ప్రతిగ్రామంలోను పంచాయతీ లను స్థాపిస్తూఉన్నారు. అవి చేయవలసిన పనులలో ఇది ప్రధాన మైంది. దూరంలో ఉండే జిల్లాబోర్డులు ఈ పనిని చేయలేవు. ప్రజాస్వామ్యంలో నమ్మకం ఉన్నవారంతా నా సూచనకు అంగీ కరించవలసిందే. ఇంతకూ ఈ బాధ్యతను ప్రభుత్వంవారు,

వారి ఉద్యోగులు, మునిసిపల్ సంఘాలు, పంచాయతీలు పంచు కొంటూ ఉన్నవి, కొన్ని అంశాలలో ప్రభుత్వానికి అధికారం; కొన్నిటిలో పంచాయతీలకు—ఈ దృష్ట్యా ఆంధ్రప్రభుత్వం వారు ఈ మధ్యన చేసినమార్పు గర్హించతగ్గది. నెల్లూరుజిల్లా లోని పాఠశాలలనన్నిటిని ప్రభుత్వంవారే నిర్వహించే ఏర్పాటు చేశారు. ఈ పద్ధతి తక్కిన జిల్లాలలోకూడా ప్రవేశపెడ్తారట. ఇదంతా ప్రజాస్వామ్యానికి విరుద్ధం,

**154.** పదేండ్లపాటు ఆర్ట్సు మరియు లా కళాశాల లన్నిటినీ మూసి వేసి, సైన్సు ఇంజనీరింగు మరియు పోలిటెక్నిక్ సంస్థలను పెంపొందించాలని డా॥ లోహియాగారామధ్యన హైదరాబాదులో చేసిన సూచన సమర్థనీయ మైనదేనా? ఆచరణ సాధ్యమైనదేనా ? ఇందువల్ల ఎటువంటి పరిణామము కలుగగలదు? మీ అభిప్రాయము వివరించగోరెదను.

ఈ సూచన సమర్థనీయంకాదు; ఆచరణసాధ్యం కూడా కాదు. ఇప్పటికీ సైన్సు ఇంజనీరింగు పట్టభద్రులలో అనేకులు ఉద్యోగాలు లేకుండా ఉన్నారు. ఈ సూచన అమలులోకివస్తే నిరుద్యోగ సమస్య మరింత తీవ్రం అవుతుంది. రెండవ ప్రణాళిక కాలంలో సాంకేతిక నిపుణులు ఎందరు అవసరమో అందులకు తగినట్లుగా సాంకేతిక విద్యాసంస్థలను వృద్ధిచేయుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. ఆర్ట్సు కళాశాలలను మూసివేసి, ఆ సొమ్మును సాంకేతిక నిపుణులను తయారుచేయుటకై ఖర్చు పెట్టవలసిన అవసరమేమీలేదు. అంత ఎక్కువగా సాంకేతిక

సంస్థలను స్థాపించడం సాధ్యంకాని పని. వాటిల్లో ప్రవేశించు విద్యార్థులను తర్ఫీదుచేయగలిగే కావలసిన ఉపాధ్యాయులు దొరకరు; ఆసక్తులై పాటుపడుటకు సిద్ధులైన యువకులుకూడ ఉండరు. వాటికై చేయబడు ఖర్చు వ్యర్థమైపోతుంది. ప్రాజెక్టులు వగైరా నిర్మాణానికి సాంకేతిక నిపుణులతోపాటు వ్యవహార దక్షత గల గొప్ప ఉద్యోగులు, నిస్వార్థపరు ఉద్యోగులు అవసరం. ఆర్ట్సు కళాశాలలను స్థాపిస్తే అలాంటివారు దొరకరు. ఆర్ట్సు విద్య మాత్రమే అభ్యసించుటకు అర్హులైన యువకులు, అట్టి సంస్థలలోని ఉపాధ్యాయులు నిరుత్సాహులై విప్లవరంగంలో చేరడంగూడా జరుగుతుంది. డాక్టర్ లోహియాగారి సూచన దూరదృష్టితో కూడినదిగాని కాదు బాధ్యతా రహితమైనది.

158. ప్రీయూనివర్సిటీ కోర్సు ఒకటి సంవత్సరంగా తెలుపగోర్తాను. దీనినిగురించి మంచిచెడ్డలు సమగ్రంగా తెలుపగలరా ?

ఇందులో మంచి ఏమీలేదు. యూనివర్సిటీలలో ప్రస్తుతం ప్రవేశిస్తూ ఉండేవారు సరి చిన్నవయస్సు (15సం॥) వారనియు, హైస్కూళ్ళలో వారు సంపాదించే జ్ఞానం యూనివర్సిటీ విద్యాభ్యాసానికి కావలసినంత ఎక్కువగా లేదనిన్ని అందుచేత 17 సం॥ వయస్సు వరకు హైస్కూళ్ళలో ఆరు ఫారాలు బదులు ఏడు ఫారాలు ఉండడం లాభకారి అనిన్నీ,

నిపుణులు అభిప్రాయ పడ్డారు. గనుక జరగవలసిన మార్పంతా హైస్కూళ్ళలో జరగవలసినట్లుగా వారు సూచించారు. యూనివర్సిటీ విధానంలో వారు సూచించిన మార్పు ఒక్కటే. డిగ్రీ కోర్సు మూడు సంవత్సరముల గడవు గలదిగ ఉండడమనేదే ఈ మార్పు. దీని మూలంగా యూనివర్సిటీలలో ప్రవేశించేవారు ఇప్పటివలె రెండు పరీక్షలు అవసరం లేకుండా ఒక్క పరీక్షతో డిగ్రీ సంపాదించడానికి వీలుంటుందని వారభిప్రాయ పడ్డారు. పరీక్షల సంఖ్య తగ్గించడం వారి ఉద్దేశ్యం.

ప్రస్తుతం ఏర్పాటుచేయబడ్డ ప్రీయూనివర్సిటీకోర్సు వీటి అన్నిటికీకూడా విరుద్ధమైంది. జరగవలసిన మార్పంతా హైస్కూళ్ళలో జరగడమే ఉత్తమం. బాల్యవయస్సులలోనివారు, విస్తారజ్ఞానంలేనివారు యూనివర్సిటీలలో చేరరాదన్న సూత్రానికి ఈ కోర్సు విరుద్ధం.

156. మన ప్రాథమిక పాఠశాలల్లో ఇంగ్లీషు, హిందీ, తెలుగు, సంస్కృతం– ఈ నాలుగుభాషలు నేర్పేపద్ధతి తలకుమించిన భారంకదా? మీ ఉద్దేశ్యం సెలవీయగోరాను.

ఇది తప్పకుండా తలకు మించిన భారం– విద్యార్థులు నిర్బంధంగా నేర్చుకొనవలసినవి. రెండేభాషలు–ఒకటి మాతృభాష (లేక ప్రాంతీయభాష); రెండు రాజభాష (ఇంగ్లీషు, హిందీ)–ఏది రాజభాష అయితే దానిని. తక్కిన భాషలను నిర్బం

ధంగా నేర్చుకొనవలసిందిలేదు. ఎవరెవరి ఇష్టప్రకారం వారు చేయవచ్చు.

**157.** విద్యార్థుల సరాసరి హాజరసంఖ్య పెంచడంతో ఆరువేలమంది ఉపాధ్యాయులకు ఉద్యోగాలనుంచి ఉద్వాసన చెప్పవలసి వస్తుందని అంచనా గదా? ఉపాధ్యాయుల జీతాలను పెంచరు సరిగదా, అసలు ఉపాధ్యాయులనే నిరుద్యోగానికి గురిచేయడం మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లక్ష్యమా ఏమిటి?

డబ్బు లేనప్పుడు ప్రభుత్వం మాత్రం ఏమి చేయగలదు? నిరుద్యోగులైన ఉపాధ్యాయులు మరేదైనా వృత్తిని అనుసరించడానికి సిద్ధంగా ఉండవలెను. ప్రభుత్వం ఉద్యోగాలుకల్పించడం అంటే అందరిచేత నిర్బంధంగాకూలిపని చేయించడంఅన్నమాట. అందరూ కూలిపని చేయడానికి సిద్ధపడ్డప్పుడే, నిరుద్యోగం తొలగుతుంది. వారి వారి యోగ్యతకు తగినట్లు ఉద్యోగాలు కల్పించడం సాధ్యంకాదు.

**158** ఇంగ్లీషు 15 సంవత్సరాలలో రద్దు కావాలని రాజ్యాంగంలో వ్రాసుకొన్నాంగదా? ఇప్పటికి సగం గడచింది. ఈనాటి పరిస్థితులను బట్టి పదిహేనుపూర్తి అయ్యేసరికి ఇంగ్లీషు పోతుందా? ఆలాంటి కారణాలేమైనా కనుపిస్తున్నవా?

ఇంగ్లీషు పోదు. కాలేజీలలో సైన్సు టెక్నాలజీ మొదలైన విషయాలు ఇంగ్లీషుద్వారానే బోధించడం అవసరమని కొద్దిరోజుల క్రిందటనేకదా నెహ్రూ, ఆజాదు మొదలైన

నాయకులు చెప్పారు. రాజ్యాంగంలో చెప్పబడ్డవి ఆదర్శాలే కాని, అన్నీ ఆచరణీయాలు కావు.

**159.** తమరు ప్రాథమిక పాఠశాలలు నడిపే బాధ్యత పట్టణాలలో మునిసిపల్ సంఘాలపైనా, గ్రామాలలో పంచాయతీల కున్నా ఉంచడం మంచిదని సమాధానం యిచ్చియున్నారు. కాని పట్టణాలలో ఎట్లాఉన్నా గ్రామాలలో ఉండే పంచాయతీ ప్రెసిడెంటునుండి మెంబరువరకు గల పెద్దమనుష్యులు పక్షపాతాలతోను బంధు ప్రీతితోను ఉంటారు. అటువంటప్పుడు పాఠశాలలు తేరపడంకూడా జరగదు. మీరేమిటంటారు?

పాఠశాల నిర్వహణ అంటే ఏమిటో కొంచెం ఆలోచించండి. భవన నిర్మాణం, విద్యాపరికరాలను సమకూర్చడం, ఉపాధ్యాయుల నియమించడం, పిల్లలను బడిలో చేర్చడం, రోజూ బడి చక్కగా పని చేస్తున్నదో లేదో గమనించడం— ఇదంతా కలిసి నిర్వహించడం అవుతున్నది. ఈ బాధ్యతను ఎవరూకూడా ఒక్కరే పూర్తిగా వహించరాదు; ఆలాగు వహించడంకూడా జరగడంలేదు. ప్రభుత్వంవారు గ్రాంటులను ఇచ్చి, ఇన్‌స్పెక్టర్లద్వారా పాఠశాలను తణిఖీచేసి, ఉపాధ్యాయుల నియామకము వారి విధులు గురించి కొన్ని రూల్సుచేసి కొంత బాధ్యతను వహిస్తున్నారు. పూర్తి బాధ్యత వారొక్కరే వహించడం సాధ్యంకాదు. రోజూ పాఠశాలలో పని చక్కగా జరుగుతున్నదా లేదా అని విచారించగలవారు గ్రామం

లోని వారే. అందుచేతనే ఆ బాధ్యతను గ్రామపంచాయతీ వహించడం మంచిదని చెప్పాను. పరిపాలన, లోపభూయిష్టంగా ఉన్నదని నాకు తెలుసు కానీ ఇన్‌స్పెక్టర్ల పరిపాలన లోపరహితంగా ఉందా? మనం పరిజ్ఞానస్వామ్యం కావాలని చెప్తున్నాం. పాఠశాలలను నిర్వహించడానికికూడా, గ్రామస్థుల ప్రతినిధులు అసమర్థులైతే దేశమునంతా ప్రజలు పాలించడం జరుగుతుందా? ఉపాధ్యాయ సంఘాలు బలపడితే ఇప్పుడు జరిగే అక్రమాలు చాలావరకు అంతరించగలవు. గనుక గ్రామంలోని పాఠశాలలను గ్రామస్థుల అధీనం చేయడం మంచిదని నా అభిప్రాయం.

160. విద్యకు తగిన వయస్సు లేక పోవుటవలన లాభమా? నష్టమా? వయస్సును నిక్కచ్చిగా పరిగణించుట విద్యాభివృద్ధికి తోడ్పడుతుందా? కనీస వయోపరిమితి అంచె లంచెలుగా ఎట్లా ఉండాలి?

తగిన వయస్సు లేకపోవుట నష్టమే. విద్య అనగా మాటలకు అర్థం చెప్పటంకాదు—విషయమును గ్రహించడం. దీనికి కొంత ప్రపంచ పరిజ్ఞానం ఉండవలెను. అనుభవముకూడా అవసరం. కొంత అనుభవం మనోపరిపక్వం ఉన్నగాని, విశ్వవిద్యాలయాలలో నేర్పు శాస్త్రములను నేర్చుకొనుటకు సాధ్యం కాదు. గనుక అంచెలంచెలుగా ప్రాథమిక విద్యకు ఒకవయస్సు,

హైస్కూలు విద్యకు ఇంకొక వంతున్ను, కాలేజీ విద్యకు మరొకటి నిర్ణయించుటే మంచిది.

**151.** నేటి విద్యాలయాల్లో విద్యాస్థాయి పూర్తిగా పడిపోవుటకు కారకులు విద్యార్థులా? ఉపాధ్యాయులా? ప్రభుత్వమా?

(1) మొదటి 7,8 తరగతులలో విద్యాస్థాయి పడిపోవుటకు విద్యార్థులు కారకులు కాజాలరు. ఆ తరగతులలో చదువువారు ఉపాధ్యాయులు చెప్పినట్లు నడుచుకొనువారు. వారి విద్యాస్థాయి పడిపోవుటకు ఉపాధ్యాయులే, ప్రధానకారకులు. విద్యను బోధించుటయందు ఉపాధ్యాయులకు శ్రద్ధ, శక్తిసామర్థ్యాలు లోపించుటచేతనే ఈ తరగతులలోని స్థాయి తగ్గుచున్నది. పై తరగతులలో విద్యాస్థాయి పడిపోవుటకు ఉపాధ్యాయులతోబాటు విద్యార్థులుకూడ కొంతవరకు కారకులు. వయసువచ్చిన విద్యార్థులు ప్రాజ్ఞతగలవారై, విద్యయందు ఎక్కువ శ్రద్ధచూపుటకు బదులు ఇతర కార్యకలాపాలలో ఎక్కువశ్రద్ధ వహించుట పరిపాటి అగుచున్నది. కళాశాలలో విద్యార్థులందు ఈ లోపము మరింత ఎక్కువగనున్నది. (2) ప్రభుత్వముకూడ దీనికి కొంతవరకు కారణము. బోధనాపద్ధతులను ఉపాధ్యాయులకు నేర్పు ట్రైనింగ్ పాఠశాలలను ప్రభుత్వమువారు నడుపుచున్నారు. కాని నాటిని వారు సక్రమముగ నడుపుటలేదు. అక్కడ శిక్షణపొందు

ఉపాధ్యాయులకు నూతనపద్ధతులను తెలుసుకొనుటకు అవకాశములులేవు. అందుచేత వారు విద్యార్థులకు చక్కగ బోధించలేని వారగుచున్నారు. ఇదిగాక వారియోగ్యతకు తగిన జీతములు ప్రభుత్వమువారు వారికి లభింపజేయని కారణముచేత వారికి పనియందు శ్రద్ధతగ్గిపోయింది. (3) పిల్లవ చదువువిషయాములు తల్లిదండ్రులకుగల శ్రద్ధకూడ తగ్గినందున విద్యాస్థాయి తగ్గుటకూడ జరుగుచున్నది. ముఖ్యముగ మధ్యతరగతి తల్లిదండ్రులతో ఈ లోపము ఎక్కువగ కనుపించుచున్నది. (4) చదువకపోయినను పరీక్షలలో కృతార్థులగుటకు క్రొత్త ఉపాయములు తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు కనుగొనియున్నారు. (5) విద్యాలయాలపై పెత్తనము వహించిన కమిటీల సభ్యులనేకులు విద్యాగంధము లేనివారు, రాజకీయరంగములో పాల్గొను అధికారప్రమత్తులు,అడ్మిషన్‌లు, ప్రమోషన్‌లు మొదలగువాటియందు వారు జోక్యము కలిగించుకొనుటచేతను, అనర్హులనుకూడ వారు ఉపాధ్యాయులుగ నియమించుటచేతను విద్యాస్థాయి పడిపోవుచున్నది. ఇంకను దీనికి యెన్నో కారణములు కలవు. (6) కారణములు ఫలానవని తెలిసిన తర్వాతకూడ వాటిని నిర్మూలించుటకు ప్రభుత్వముగాని ప్రజానాయకులుగాని యొట్టిచర్యలను తీసుకొనుటలేదు.

1:2. స్కూళ్ళలో బేసిక్ విద్య ప్రవేశపెట్టడంవల్ల లాభాలేమిటి ? దానివల్ల విద్యావిధానంలో జరిగే మార్పులేమిటి ?

నిజమైన విద్యను నేర్చుకొనుటకు పుస్తకాలు మాత్రమే సాధనముకాదు. ఏదైనా ఒకపని—వడకుట, నేయుట, వ్యవసాయము, వడ్రంగము మొదలైనవి—చేసి, దాని మూలమున సంపాదించిన అనుభవము— ఆ అనుభవముద్వారా సంపాదించిన జ్ఞానము పిల్లలను ఎక్కువ విద్యావంతులుగ చేయగలవు. బేసిక్ విద్యకు ఈ సూత్రము ఆధారము. అందువలననే ఇది ఎక్కువ లాభకరము.

163. పాఠ్యగ్రంథాల ప్రచురణకు ప్రభుత్వం పూనుకొనడం వాంఛనీయంకాదా ? ఏల ?

ఇది వాంఛనీయంకాదు. ప్రజలు సమర్థతతో నిర్వహించుచుండు పనులను ప్రభుత్వం నిర్వహించకూడదు. పాఠ్యగ్రంథాల ప్రచురణను ప్రజలు చక్కగా నిర్వహిస్తున్నారు. ప్రస్తుతం పాఠశాలలో వాడబడు గ్రంథాలను సమర్థులైన గ్రంథకర్తలు వ్రాసియున్నారు. వీరికంటె ఎక్కువ సామర్థ్యంగల వారు ప్రభుత్వానికి లభించజాలరు. ఇప్పటికంటె ఉత్తమములైన గ్రంథాలను ప్రభుత్వం తయారుచేయడం సాధ్యం కానప్పుడు ఈ పనికి ప్రభుత్వం ఎందుకు పూనుకొనవలెనో తెలియుటలేదు. ప్రభుత్వ ప్రచురణ ఇప్పటికంటే చౌకగాను విద్యార్థులకు లాభదాయకంగాను ఉండదు. ముద్రణాలయములలో పనిచేయుచుండు కార్మికులనేకులు ఈ మార్పువలన నిరుద్యోగులవుతారు. గ్రంథకర్తలనేకుల జీవితం దుర్భరమవుతుంది. ప్రణాళికకాలంలో

ప్రభుత్వం ఈ ప్రచురణకంటె ఎక్కువ అవసరములైన పనులనే కముల‌ను చేయవలసి ఉన్నది. ఏదిముందు, ఏదివెనుక, అనే దాన్ని విచక్షణచేయక ప్రభుత్వము ఇందులో ప్రవేశిస్తూ ఉన్నది.

**164.** ఈ రోజులలో పురుషులతో అన్ని విషయములందును స్త్రీలకు సమానహక్కుల నొసగుటవలన సంఘమునకు శ్రేయస్కరమా ? ఏల ?

శ్రేయస్కరమే. పురుషులకు ఏలాటి హక్కులున్నవో ఆలాటి హక్కులు స్త్రీలకుకూడ లభించిన యెడల స్త్రీలలో లీనమైయుండు తెలివితేటలు, ప్రజ్ఞ ప్రతిభ ఇతర శక్తులు ఉచ్ఛ స్థితికి వచ్చి బహిర్గతములై, సాంఘికాభివృద్ధికి తోడ్పడగలవు. ఇదివరకు సంఘముయొక్క శ్రేయస్సుకు పురుషులు మాత్రమే ఎక్కువ బాధ్యతను వహించుచుండిరి. స్త్రీల బాధ్యత వారికి గల అవకాశము తక్కువగా వుండెను. హక్కులు సమానము లైనప్పుడు సంఘసేవయందు స్త్రీలుకూడ ఎక్కువ తోడ్పడగల వారగుదురు.

**165.** కాలేజీలలో మా బోటి విద్యార్థినులువెళ్ళి చదువుకొనడానికి అవకాశముండుటలేదు. విద్యార్థులు ఏవో అంటుంటారు; ఏవేవో చేస్తూ ఉంటారు. దీనికి తరుణోపాయము సెలవిటండీ ?

విద్యార్థులలో నైతిక విలువలు తగ్గినవనే అభిప్రాయా నికి ఇది తార్కాణము. విద్యార్థినులకు-ముఖ్యముగా పం

రెండవ మొదలు పద్దెనిమిది సంవత్సరముల వయస్సువానికి— ప్రత్యేక పాఠశాలలు స్థాపించుటయే దీనికి తరుణోపాయము. ప్రస్తుత పరిస్థితులలో సాధనాంతరములేదు. తమ్ము అవమాన పరచ తలచు విద్యార్థులను యెదిరించి, వారితో సరిసమాన ముగ నిలబడుటకు కావలసిన శక్తిని విద్యార్థినులు సంపాదించుట మరియొకమార్గము. ఒక్కొక కాలేజిలోని విద్యార్థినులు ఒక ప్రత్యేక సంఘముగా యేర్పడి, సంఘముద్వారా విద్యార్థుల దుండగములు నణచుటకు ప్రయత్నించవలెను. స్త్రీలు అబలలు అన్న సూత్రము సత్యదూరమని వారు ఋజువుచేయవలెను.

# కళలు : సారస్వతము



166. నేటి ప్రజాజీవితానికి సాహిత్యానికి యెటువంటి పొత్తు అభిలషణీయం?

ప్రజా జీవితములోని గుణదోషాలను వివరించి, యిప్పటికంటే ఉత్కృష్టమైన జీవితమందు ప్రజలలో అభిరుచి కలిగించి, అందుకు తగిన హృదయ పరివర్తనమును ఉద్రేకమును రేకెత్తించగల సాహిత్యము వృద్ధికావలసి వున్నది.

**167.** సంస్కృతి—నాగరికత పదాల అర్థంలో వ్యత్యాసం వివరించ కోరుతాను.

సంఘం సౌఖ్యంగా జీవించు ఉద్దేశంతో కల్పించుకొన్న సాధన సామగ్రియొక్క సముదాయమునకు—పనిముట్లు, ఆర్థిక విధానము, పరిపాలన విధానము, సాంఘిక వ్యవస్థలు, మతము, కళలు—వీటి సముదాయమునకు సంస్కృతి అనిపేరు. సంస్కృతిని రెండు దశలుగా విభాగముచేసి, రెండవదశలోని సంస్కృతికి నాగరికత అనిపేరు పెట్టియున్నారు. ఈ విభేదము సాంఘిక శాస్త్రజ్ఞులు కల్పించినది. తొలిదశలో సంఘమునకు కులములు (Clans) ఆధారములుగ నుండినవనియు, రెండవదశలో నివాస భూమి—నగరములు—ఆధారమయ్యెననియు అప్పటినుంచి వృద్ధి గాంచిన సంస్కృతియే నాగరికత అనియు వీరి అభిప్రాయము. ఈ వ్యత్యాసమును గురించి ఇతర అభిప్రాయములుకూడ ఉన్నవి.

**168.** ప్రాచీన సంస్కృతి పునరుద్ధరణ జరగాలంటున్నారే, అది ఏనాటి సంస్కృతియో, దాని స్వరూప వివరణ కావిస్తారా ?

పరాయివారైన మహమ్మదీయులు మన దేశమును జయించుటకు పూర్వముండిన సంస్కృతియే ప్రాచీన సంస్కృతి. యంత్రసహాయము లేక వస్తుసామగ్రిని ఉత్పత్తిచేయుట రాజ్యాధికారము ఏకస్వామ్యముగ నుండుట, వర్ణవ్యవస్థతో కూడిన సంఘజీవితము, పునర్జన్మ కర్మసిద్ధాంతముల నాధారముగ

జేసుకొన్న ఆధ్యాత్మిక జీవితము, విశిష్టత గాంచిన లలితకళలు—ఆ సంస్కృతియొక్క ప్రధాన లక్షణములు.

**169.** సంస్కృతి అనేదానికి నిర్వచనం ఏమిటి ?

జీవితాన్ని సౌఖ్యంగా సాగించుకొనడానికి మానవ సంఘం కల్పించుకొన్న సాధన సామగ్రికి సంస్కృతి అని పేరు. వస్తురూపంగానూ, సాంప్రదాయాల రూపంగానూ, సాంఘిక సంబంధాల రూపంగానూ, ఆధ్యాత్మిక తత్వాలరూపంగాను, కళారూపంగాను ఉంటున్నది. వీటి అన్నిటియొక్క సముదాయమే సంస్కృతి.

**170.** తెనుగు తెలుగులలో ఏది సరియైన పదము? అది ఎటనుండి జనించినదో తెలియపరుస్తారా ?

రెండూ సరియైనవే 'తెనుగు' కొంచెం ప్రాచీనం. తెనుగు త్రినగంలోనుండిన్నీ తెలుగు 'త్రిలింగం' లోనుండిన్ని వచ్చినట్లు చెప్పెదరు. కాని అందరూ అంగీకరించిన సమాధానము ఏదీ లేదు.

**171.** మన తెలుగుభాష సంస్కృతభాషాజన్యమా ?

కాదు. ఇది ద్రావిడ భాషలలో చేరినది.

**172.** మనదేశీయ లిపులలో అతిపురాతన లిపియేది ? దానినేపద్ధతిలో ఉపయోగించేవారు ?

బహు ప్రాచీనకాలమునుండి 5000 సంవత్సరాలక్రిందట సింధు నాగరికతకాలమున—చిత్రలిపిని వాడుచుండిరి, కాని దాని అర్థము తెలియుటలేదు. తర్వాత బ్రాహ్మి, ఖరోష్టి అను రెండు అక్షరలిపులు వాడుకలోకి వచ్చెను. వీటిలో బ్రాహ్మి కొంచెము పురాతనమైనది. ప్రస్తుతము మన దేశమున వాడుకలలో నుండు లిపులు దీనినుండి పుట్టినవే. దీనిని ఎడమనుండి కుడివైపు వ్రాయుచున్నాము. ఖరోష్టిని కుడినుండి ఎడమవైపు వ్రాసేవారు.

**173.** కళ, జీవిత సమస్యా పరిష్కార శాస్త్రమనుటలో మీ అభిప్రాయం తెలియజేయగోరెదను.

జీవిత సమస్యా పరిష్కార సాధనములలో కళ ఒకటి. కానీ ఆ పరిష్కారమునకు ఇది ఒక్కటే సాధనముకాదు. ఆదర్శ జీవితములో సత్యం, శివం, సౌందర్యం—ఈ మూటి యొక్క సమన్వయం జరుగుతుంది. కళ సౌందర్యానికిమాత్రమే సంబంధించినది, గనుక కళోపాసనతోపాటు సత్యోపాసన, శివోపాసన ఉన్నప్పుడే పరిపూర్ణత్వం లభిస్తుంది.

**174.** పూర్వమునుండీ మనకవులు సరస్వతీదేవిని మాతృభావంతోనే ఉపాసించేవారు. కాని, నా దృష్టిలో పిల్లలమర్రి పినవీరభద్రుడొక్కడే 'వాణి నా రాణి' యను భావంతో చూచినాడు. నేటి కవులుకూడా కొందరు సరస్వతీదేవిని యిట్టి భోగభావంతో చూచుచున్నారు. యిది మాత్రము నాకు కవులపై చాల జుగుప్సను కలిగించుచున్నది. 'సరస్వతీ నమస్తుభ్యం' అను ప్రార్థనతో చదువు నారంభించిన యిట్టి కవులు యిట్టి భావనశారద మాతపై కావింపనగునా ?

మీరు అనవసరంగా జుగుప్సను పడుతున్నారు. సరస్వతిని—భాషను వశం చేసుకొంటేనేగాని కవిత్వం చెప్పడం సాధ్యం కాని పని. ఇది సరస్వతిని భోగభావంతో చూడడం కాదు. ఇంతేకాకుండా ప్రస్తుతకాలంలో భార్యాభర్తల మధ్య ఉండే సంబంధం పూర్వకాలపు సంబంధంవంటిది కాదుగదా? స్త్రీ పురుష సమానత్వంతోపాటు భార్య భర్తచే పూజింపతగ్గదనే భావం ఈ కాలంలో వ్యాపించి ఉంది. ప్రస్తుత కవుల సంబోధనను ఈ భావంతో సమన్వయం చేయవలసివుంది.

**175.** పై ప్రశ్నకు తాము ఇచ్చిన సమాధానము తృప్తికరముగా లేదు ఒకకవి, 'రసభర విజృంభమాణ పూర్ణకుచకుంభ'యని తాను స్వాధీనము చేసికొనిన సరస్వతినిగూర్చి వ్రాసినాడు... ఇవి భోగభావములు కావా?

కవి సమయాలకు విపరీతార్థాలు కల్పించడం ధర్మం కాదు. గోపికలకు కృష్ణునికి మధ్యన ఏర్పడ్డ సంబంధం వ్యభిచారమని అనుకొనుట ఎంతటి పొరపాటో కవిసమయాలకు విపరీతార్థం కల్పించడంకూడ అలాటిదే. భాషను పూర్తిగా వశం చేసుకొన్నట్లు వివరించడానికి ఈ మాటలు కవి వాడాడు. సరస్వతీ అనే స్త్రీ లేదు. పూర్ణ కుచకుంభం అంతకంటే లేదు.

**176.** ప్రాచీనకాలమున సంస్కృతి ఎట్లు తూర్పుదేశములకు ద్వీపములకు సింహళద్వీపమునకు వెడలినది?

వర్తకులు, మత ప్రచారకులు, వలసపోయినవారు — వీరిద్వారా మన సంస్కృతి ఈ ప్రదేశాలకు వెళ్ళగలిగెను.

యుద్ధంద్వారాను, సామ్రాజ్య సంస్థాపనము ద్వారాను వెళ్ళి నట్లు లేదు.

177. ప్రాచీనకాలమున ప్రజాభిప్రాయమును మార్పుపొందించగల సాధనము లేవిధముగా ఉండేవి ?

పూర్వకాలంలో ప్రజాభిప్రాయం మారడం అనేదే ఎక్కువగా ఉండేదికాదు. సంఘం పూర్వాచారబద్ధంగా ఉండేది. మతప్రచారకులు తత్వోపదేశం చేసినవారు—వీరిద్వారా ప్రజాభిప్రాయం ఎప్పుడైనా మారేది. బౌద్ధాదిమతాలు ఈ విధంగానే దేశంలో వ్యాపించాయి.

178. పెండ్లి అన్న పదానికి పూర్తి నిర్వచనము. అది హైందవ సాంప్రదాయానికి ఎంతవరకు అనుసరిస్తున్నదీ తెలియజేస్తారా ?

పెండ్లి అనేది స్త్రీ పురుషుల సంబంధాన్ని నియమబద్ధంగా చేయడానికిన్ని, సంతానాన్ని పెంచి పెద్దవారినిగా చేయడానికిన్నీ ఏర్పడ్డ సాధనం లేక కట్టుబాటు. జీవితమంతా నియమబద్ధంగా ఉండడం అవసరం. నియమరహితమై స్త్రీ పురుషులు సంచరించడంమూలాన శరీరానికి మనస్సుకు వైకల్యం కలిగి, పటుత్వం చెడిపోవడం తప్పదు. పిల్లలను పెంచి పెద్దవారిని చేసే బాధ్యత తల్లి తండ్రులు వహించినట్టు ఇతరులు వహించజాలరు. హైందవ సాంప్రదాయం ఈ రెండు ప్రయోజనాలను చాలవరకు కలిగిస్తున్నది.

179. రాహుల్ సాంకృత్యాయన 'వోల్గానుంచి గంగాతీరము' చారిత్రకాధారాలు గల గ్రంథమేనా ?

ఇది చారిత్రక గ్రంథంకాదు. చరిత్రలోని కొన్ని విషయాలను మార్క్సు సిద్ధాంతదృష్ట్యా వ్యాఖ్యానించే గ్రంథము. మతము, మతసాంప్రదాయాలు ఆచారాలు ప్రజాసామాన్యాన్ని దారిద్ర్యంలోను అజ్ఞానంలోను ఉంచడానికి అగ్రవర్గాలకు చెందిన బ్రాహ్మణులు క్షత్రియులు పన్నిన కుట్రలనీ వీరి అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని అనుసరించి వీరు వీరి వ్యాఖ్యానాన్ని సాగించారు. ఇది దేశచరిత్రను అపార్థము చేసుకొనుటయే. పునర్జన్మ కర్మసిద్ధాంతము, యజ్ఞయాగాది క్రతువులు మొదలైనవాటిని ఏ కొద్దిమంది బ్రాహ్మణులో క్షత్రియులో దురుద్దేశంతో ప్రతిపాదించడం జరుగలేదు. ఇవి కాలక్రమాన అన్ని వర్గములకు చెందిన వారి కృషిమూలమున ప్రచారములోనికి వచ్చినవి. కాళిదాసుయొక్కయు బాణునియొక్కయు మనోభావములను గురించి వీరు చిత్రించిన విషయములుకూడ కవుల హృదయమును వీరు చక్కగ అర్థము చేసుకొనలేదని స్పష్టము చేయుచున్నవి. వీరి గ్రంథము కల్పనలతో కూడిన కావ్యమని చెప్పదగినదేగాని, చారిత్రక గ్రంథమను పేరునకు తగినదికాదు. దీనిని చదువువారు విమర్శకబుద్ధితో దీన్ని చదువవలెనేగాని, ఇందులోని విషయములను ప్రతిపాదింపబడిన సిద్ధాంతములు యథార్థములన్న విశ్వాసముతో చదువరాదు.

**180.** సాహిత్య ఎకాడమీ ప్రభుత్వమువారి ఆధ్వర్యాన నిర్వహిం చడం వాంఛనీయమే నంటారా ?

ఇది వాంఛనీయం కానేకాదు. దేశంలోని పనులన్నిటిలో ప్రభుత్వంవారు జోక్యం కలిగించుకోరాదు. కొన్నిపనులు ప్రజల ఆధ్వర్యాన జరగడం ఉచితమూ అవసరమూ, ప్రజలు నిర్వహించుకొనలేనట్టి పనులను మాత్రమే ప్రభుత్వం జరిపించడం మంచిది. సాహిత్యాభివృద్ధికి సంభవించిన కార్యకలాపాలన్నిటినీ ప్రజలలో సాహిత్యాభిమానులుగా ఉండేవారు సమర్థతతో జరిపించుకోగలరు. ప్రభుత్వ ఆధ్వర్యాన అభివృద్ధిజెందే సాహిత్యం స్వాతంత్రాన్ని కోల్పోయి అధికారంలో ఉండేవారి అభిప్రాయాలను అనుసరించునదిగా మారిపోగలదు. ప్రభుత్వం చేయుపనులలో సాధారణంగా దుర్వ్యయం వ్యర్థవ్యయం ఎక్కువగా ఉంటుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలకు సంబంధించిన పనులలో నిమగ్నులై, వాటిని సాధించుటకు సర్వప్రయత్నములను చేయవలసిన ప్రభుత్వమువారు వారి దృష్టిని సాహిత్యాది రంగములలోకి మరలించుకొనుట అప్రాజ్ఞత. ఏపని ఎట్టి పరిస్థితులలో చేయవలసియున్నదో తెలియక ప్రభుత్వమువారు సాహిత్య ఎకాడమీ స్థాపనలోకి దిగిరని చెప్పవలసియున్నది.

**176.** ధర్మానంద కోశాంబిగారి గౌతమ బుద్ధచరిత్ర ఆధారాలుగల గ్రంథంగా పరిగణించవచ్చునంటారా ? సిద్ధార్థుడిట కేవలం ఒక జమీందారు కొడుకు అనేది వాస్తవమేనా ?

కోశాంబిగారి గ్రంథం చరిత్రాంశాలు గల గ్రంథంగా పరిగణించ తగినది. బౌద్ధమతానికి సంబంధించిన పాలీవాఙ్మయాన్ని, సంస్కృత వాఙ్మయాన్ని విమర్శ దృష్టితో పరిశోధన గావించి, ఇతర పరిశోధకుల అభిప్రాయాలను గుర్తించి, కోశాంబి గారు ఈ గ్రంథాన్ని రచించారు. గౌతముడు బోధించిన మధ్యమార్గస్వరూపం, అలాటి మార్గాన్ని ఆయన బోధించుటకు గల కారణాలు, దాని మూలాన కలిగిన ఫలితాలు అవగాహన చేసుకోవడంలో ఈ గ్రంథం చాలా తోడ్పడుతుంది. ఇందులో గ్రంథకర్త చేర్చిన కథలు ముఖ్యంగా చదువతగియున్నవి. ఇంత మాత్రంచేత వారి సిద్ధాంతాలు, బ్రాహ్మణ వైదిక మతముల పట్ల వారు ప్రదర్శించిన వైఖరి యథాతథంగా స్వీకరణ యోగ్య మని అనుకోరాదు. వీటి విషయమై పాఠకులు వారి విమర్శనా శక్తిని వినియోగించవలసిఉన్నది. సిద్ధార్థుడు కేవలం జమీందారుకొడుకని కోశాంబిగారు చెప్పలేదు. 'జమీందారు' అనే మాటను ఈ కాలంలో మనం అర్థం చేసుకొన్నట్లు— ఆ కాలపు పరిస్థితులలో అర్థం చేసుకొనరాదు. క్షత్రియభూస్వామి కొడుకు అని చెప్పటమే కోశాంబిగారి ఉద్దేశం. శుద్ధోదనుడు గొప్ప రాజ్యాన్ని పాలించిన రాజు కాడు ఒక సామాన్య క్షత్రియకుటుంబీ. కోశాంబిగారు చెప్పదలచుకొన్నది ఇదే.

"SAMADHANA VEDIKA" by Prof. M. VENKATARANGAIAH

Price Rs. 1-12


TELUGU VIDYARDHI PUBLICATIONS

MASULIPATAM